జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.

★

సంపాదకులు
విశ్వనాథ సత్యనారాయణ
జువ్వాడి గౌతమరావు

★

సంపాదక కార్యాలయము
ఉస్మాన్‌పురా, కరీంనగరము

★

సంపుటి 2 సంచిక 2
డిసెంబరు '59
విడిప్రతి 75 న. పై.

# జయంతి



---

సంపాదకీయము

శైష్యోపాధ్యాయిక
*మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి*

జీవుని వేదన-2 — వాల్మీకి వృత్తాంతము
*ధూళిపాళ శ్రీరామమూర్తి*

వానలో తడుస్తున్న మనిషి
*మంజుశ్రీ*

జ్యోతిరన్వేషణ
*తుమ్మపూడి కోటీశ్వరరావు*

కథానిక - ఒక పరిశీలన
*జె. వి. సుబ్బారాయుడు*

వీథిదీపం
*వి. శశి*

చింత
*అయాచితుల హనుమచ్ఛాస్త్రి*

సంధ్యాగీతము
*యస్వీ జోగారావు*

రసము : స్వస్థాన వేషభాషాభిమతము
*ఉపాధ్యాయుల నరసింహమూర్తి*

శరత్తు
*బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి*

చర్చావేదిక

మృత్యుంజయము
*విశ్వనాథ సత్యనారాయణ*

ఆకాశవాణి

సాహిత్యధార

పుస్తక సమీక్ష

ఆధునిక సాహిత్యగతిని సూచించే

హిందీ మాసపత్రిక :

# 'కల్పన'

నవ్య కవితా రీతులు

కథలు

సాహిత్య విమర్శలు

ఆధునిక సాహిత్య సమస్యలపై

విశేష చర్చలు.

కార్యాలయము :

౩౧౬, సుల్తాన్‌బజార్

హైదరాబాద్.

★

## గమనిక

జయంతి ప్రకటన కార్యాలయం కరీంనగరం మార్చబడుతున్నది. కాబట్టి జనవరి సంచిక వెలువడదు. ఫిబ్రవరి సంచిక యథాప్రకారం జనవరి చివరి వారంలో వెలువడుతుంది. సం. జ.

J 1149

# సంపాదకీయము

సాహిత్యము మానవప్రవృత్తులు ఆదిలో నన్నియును స్వచ్ఛముగానే యుండును. కాలము గడచిన కొలది మానవప్రవృత్తిలోని దోషములు సంక్రమించుటచేత నవి దూషితము లగుచుండును. ఇది సృష్టి యొక్క లక్షణము. సృష్టిని ఏకాంతమునకు మాత్ర మెందుకు తప్పును? ఇది కాలస్వభావము. కృతయుగము మొదట, కలియుగము చివర కదా! సాహిత్యము తొలుత రసానందమును సమకూర్చుట కొరకేర్పడినది. మన పూర్వులు దాని నట్లు భావించినారు. తదానుభవికముగా నిర్మించినారు. ఈదేశమున తొలుతనుండియు 'మనుష్యుడు' జన్మ మెత్తినాడు. ఎందు కెత్తినాడు, ప్రయోజనమేమి? ఊరకే పుట్టి ఊరకే చచ్చుట కొరకేనా? అల్పములైన లౌకికసుఖములు, అధికములైన లౌకికదుఃఖములు ననుభవించి చచ్చుటకేనా? అట్లయినచో నీ సృష్టియంతయును చాల వ్యర్థమైనది. కాని నమ్మించుకోరానిది. శరీరము దుఃఖముల అల్పసుఖముల నన్నింటిని వారెవ్వడును దీనిని సహించుకొనలేడు. ఇంతకంటె నధికమైనదేదియో యొకటి కలదు. అజరామరమైనది. ఆనంద స్వరూపానుభూతి యైనది. దానిని సాధించినచో జన్మకు చరితార్థ్యమని మన పూర్వులు భావించిరి. ఇట్టి యూహాపరంపర వెంటనే మతములు నిర్మింపబడినవి. నాశ్యంతమైన యీ శరీరము జీవికి జీవికి నిత్యముగాదు. ఇంతకంటె నిత్యమైన వస్తువేదియో యుండవలయును. దానిని సాధించుటకే ఈ శరీరయాత్ర ప్రధానముగా వినియోగింపబడవలయును అనెడి తాత్పర్యమే ధర్మములను మతములను న్యాయమును విజ్ఞానులచేత నిర్మింపబడినవి.

సర్వనాగరక జాతులకు సారస్వత ముండునని గదా నేడందరు చెప్పుచున్నారు. అట్టి సారస్వత మనాదినుండి మనదేశమున నున్నది. ఈసారస్వతము యొక్క పరమప్రయోజనమేమి? అని ప్రశ్నించినచో పూర్వులు చెప్పుకొన్న సమాధానము 'రసానందమని.' ఎందుకనగా మతము లున్నవి. ధర్మములున్నవి. పదభిముఖముగా మానవుడు నడచినచో చాల కట్టు బాట్లకు లోబడవలయును. అతని వాంఛలు నియమింపబడవలయును. మనస్సును హద్దులో పెట్టుకొనవలయును. ఇది చాల దుర్ఘటమైన పని. కోరికలు వానియంతట నవి చెల రేగును. ఆకోరికలు ఫలించినను ఫలించకపోయినను కోరికలు విజృంభించుచునే యుండును. మనోనియమముకంటె దుర్ఘటమైనది లేనేలేదు. అట్టి స్థితిలో మనప్రయత్నము లేకుండ, మనస్సును నియమించవలసిన యవసరము లేకుండ, దానియంతట నది నియమింపబడి యానందమును సమకూర్చుకొనుటకు మార్గమున్నదా? ఉన్నదని మనపూర్వ ఋషులు చూచిరి. దానిపేరు సారస్వతము. కొద్దిలో కావ్యము. కావ్యమునందు ప్రధానముగా లోకవృత్తమే యుండును. మానవుల యొక్క సుఖదుఃఖముల చరిత్ర యుండును. ఒకడు తానెన్నియో యనూహించుకొనుచుండును. అవి యన్నియు కావ్యమునందుండును. వాని కోరికల ననుగుణముగానే కావ్యముండును. ఆకావ్యమొక పద్ధతిగా వ్రాయబడినచో వాని మనస్సాకావ్యము వెంటబడి వాని ప్రయత్న మక్కరలేకుండ రసానంద మనుభవించును. ఆకావ్యమట్లు వ్రాయబడుటకు రసవేత్తయైన కవి కావలయును. మరియు నా కావ్యము నట్లాస్వాదించుటకు వట్టి మనస్సు కాక

చదివిన మనస్సు భావమునందు మగ్నము కాదగిన వాడిని సంపాదించుకొన్న మనస్సు పలుకుబడి యొక్క సొగసు తెలిసికోదగిన మనస్సు కావలయును. అప్పుడా కావ్యానందమును పొందవచ్చును. దానినే మనపూర్వులు రసమని చెప్పిరి. పైగా రసమనగా సాక్షాద్బ్రహ్మ పదార్థమే యని చెప్పిరి. ఒకసారి యా యనుభూతి కలిగినచో దాని రుచిని జీవుడు వదలిపెట్టలేడు. అది క్రమక్రమముగా జీవునియొక్క ఈ జన్మపరంపర, దుఃఖపరంపర మొదలైన వాని నుండి విడుదలకలవానిగా చేయగలదు.

ఇట్టి రసానందముకొఱకు నిర్మింపబడిన దీ సారస్వతము. ఆ రసానందము లోకమునకు సంబంధించనిది. మానవునియొక్క మనోవేగము నాశ్రయించి మానవునియొక్క కోరికల మార్గము ననుసరించి పోదగినది, పొందదగినది. చివరకు లోకము వదలి పెట్టించునది. లోకమనగా మాత్సర్యము ద్వేషము కోపము అనురాగము ఇష్టానిష్టములు తదనుబంధి సదసత్క్రియాచరణము. వీనినుండి విడుదలపొందుటకు సులభమైన మార్గము కావ్యరసాస్వాదనముగా మనపూర్వులు నిర్ణయించిరి.

ఇది యిట్లుండగా కాలము గడచినకొలది లోకములోనున్న వృత్తులయందువలె సాహిత్యమునందు గూడ మత్సరము ద్వేషము మొదలైనవి తాండవింప నారంభించినవి. పరమేశ్వరుని పొందుటకొఱ కేర్పడిన మతముల నాశ్రయించియే జీవులు కొట్టుకొని చచ్చిరి. చచ్చుచున్నారు. ఆ సందర్భములో సాహిత్య పరమప్రయోజనము నుండి దూరముగా పోయి తమ తమ మాత్సర్యద్వేషాదులు ప్రకటించుకొనుటకు సాహిత్యమునుకూడ నొక సాధనముగా చేసికొనుచున్నారనుటలో విడ్డూరమేమియు నుండనక్కరలేదు. నా మతము గొప్పదనగా నా మతము గొప్పదని వాదించుకొనుచున్నారు గదా! వాని మతమును బట్టి తన జీవుని యొక్క విముక్తిని సాధించుకొనుట' వదలిపెట్టి తన యహంకార ప్రాకట్యమునకు దానినొక యుపాధిగా స్వీకరించికొని తమ కామక్రోధాది గుణావిష్కారము చేసికొనుచున్నారు. ఆ మతములో వాడు పుట్టుట ఆ మతమేర్పరచిన ఋషుల యొక్క మహావాక్యము ననుసరించుటకు కాదు. దానిని పురస్కరించుకొని ఇతర మతములవారి మీదికి దాడి వెడలుటకొరకు. ఆ దాడి వెడలుట లౌకికమైన స్వలాభము కొరకు. సరిగా సాహిత్యమునందుకూడ నిదియేపని జరుగుచున్నది.

ఒకడొక కావ్యమును వ్రాసెను. నీవు చదువుము. నీకు బాగుగా నున్నచో నానందింపుము. లేనిచో పరిహరించుము. అంత వరకే కావ్యము యొక్క ప్రయోజనము. ఇది దాటి నీ ప్రయోజనము సాగును. మానవ ప్రకృతి యెట్టిదనగా తన కొక సంగతి బాగున్నచో నితరులకు గూడ దానిని గురించి తెలియజేసి వారు కూడ బాగుగా నున్నదనినచో సంతోషించుట. ఇవి రెండు విధములైన సంతోషములు. మొదటిది రుచిగానున్నదని నీవు తెలిసికొని దాని నాస్వాదించుటవలన వచ్చిన సంతోషము. రెండవది దానినింకొకడుకూడ బాగుగా నున్న దన్నచో నీవు పొందెడి వట్టి మానసికమైన సంతోషము. ఈ సంతోషము న్యాయముగానే యున్నది. నీ కొకటి బాగుగా లేదు. ఇంకొకనిచేత నది బాగుగా లేదనిపించి నీవు పొందెడి సంతోషమున్నది. ఈ రెండవ సంతోషమునకు మొదటి సంతోషమునకు సంబంధ మేమి? మొదటిది ఉత్తమము, రెండవది అధమము నగునా? రెండవది సంతోషమా? సంతోషాభాసమా? అచ్చమైన సంతోషమునందు ద్వేష ముండదు. అహంకారముండదు. ఒక లౌకికమైన దుష్టమైన తృప్తియుండదు. రెండవ విధమైన సంతోషములో ఈ లక్షణముల యొక్క స్పర్శయున్నట్లు కనిపించుచున్నదే. అది పరిహారణీయ మన్నట్లు భాసించుచున్నది.

ఊరకే మనకు బాగుగా నుండకపోవుటకాదు. అదివరకే మన మనస్సులో నొక ద్వేషమో మాత్సర్యమో పెట్టుకొని దానియందొక వైముఖ్యమున

పెంచుకొని దానిని మన మాస్వాదించకమునుపే దానియందు ద్వేషముతో ప్రవర్తించి యా ద్వేష భావమును పదిమందికి పంచి దానివలన మానవు డొక తృప్తిని పొందెనా ఆ తృప్తియొక్క యధ మత్వ మింతయని చెప్పుటకు వీలున్నదా ? దానిని తృప్తియనుటకే వీలులేదేమో ! తనకున్న ద్వేషాహంకారములకు నొక విధమైన ప్రశాంతికాని ప్రశాంతి సమకూర్చుకొనుచున్నా మన్న భ్రాంతిగాని దానియందు తృప్తిలేదు. ఏలయనగా తృప్తి యొక్క లక్షణము తరువాత మరింకేదియు నక్కర లేదనుట. ఈ రీతిగా నీ ద్వేషము పదిమందికి పంచి నీవు పొందిన భావము పర్యాయమైనది కాదే! తిరిగి తిరిగి యట్లు చేయుచుండుటయే దాని లక్షణముగా కనిపించుచున్నది. అట్టిదానిని తృప్తి యనుటకు వీలులేదు.

సర్వధా యిట్టిభావము మాత్సర్యద్వేష విరోధాది గుణములకు నాటపట్టైన సామాన్యజీవితము లోనిదే. తదతీతమైనదికాదు. సారస్వతము తదతీతమైన యొక రసానందముకొఱ కుద్దేశింపబడినది. ఆ సారస్వతమునే తీసికొని లోకవృత్తమునే నెరపుచున్నాడు మానవుడు. వాని విషయములో మత మెంత వ్యర్థమైనదో సారస్వతము నంత వ్యర్థమైనదియే. ప్రతి వాడును తానొక మతమునందు పుట్టుచునే యున్నాడు. వాడు పుట్టిన జాతికొక సారస్వతమున్నచో నుండవచ్చును. ఉన్నచో చదువవచ్చును.

మానవులు సాధువులు అసాధువులు అని రెండు రకములు. ఈ రెండుగుణములు నొక్కొక్కప్పుడు వేళననుసరించి యుండును. వయస్సు ననుసరించి యుండును. జన్మ జన్మయంతయు వాడు వాడుగా వీడు వీడుగా నుండిన నుండవచ్చును. ఆదిలో నసాధువులు జీవితాంతమున సాధువులైనవా రున్నారు. ఆదిలో సాధువులై జీవితాంతమున నసాధువులైన యభాగ్యవంతులు కలరు. నిజముగా జూచినచో నెప్పుడు నెవ్వరి నేమియు ననవక్కరలే దనిపించును. కాని సద్వినయము చెప్పబడనే వలయును. చెప్పినంతమాత్రాన లోకమంతయు నొక్కసారిగా సాధువై విడంబించదు. కాని ఏ మంచిమాట ఎప్పుడెవనికి నచ్చునో తెలియదు గనుక మంచి మాటలు చెప్పబడుచునే యుండవలయును.

ఈ సారస్వతము మనము రసాస్వాదన చేయుట కొరకును ఎవనికి వాడుగా నానందించుటకును ప్రధానముగా నేర్పడినవి. కావ్యములలో కూడ సాధుకావ్యము లసాధుకావ్యములు నుండును. అసాధుకావ్యములయందలిదోషములు పెద్దలునిరూపించుటయు వానిని పరిహరించుకొనుటకు తరువాతి వారు ప్రయత్నము చేయుటయు, న్యాయమైన పద్ధతియే. ఈపద్ధతిలో మానవునియొక్క యహంకార సంక్రమణము జరిగి ధర్మ మధర్మమగును. ఇవి దోషములని తెలిసి చెప్పెడివాడు తా నధికుడనన్న భావముతో చెప్పినచో వినెడివాడు వీడు చెప్పెడిదేమి నేను వినెడిదేమి యను నహంకారముతో విన్నచో ధర్మబోధయొక్క ప్రధానోద్దేశ్యమే చెడిపోయినది. ఇది దోషమునకు మొదలు. అచ్చటినుండి ఎన్నిదోషములైనను సంక్రమించవచ్చును. దోషములు చెప్పుటకు సమర్థుడు కానివాడుకూడ చెప్పుటకు మొదలిడుట, తన కధికారము లేకపోవుట దోషములు కానివానిని దోషములుగా చెప్పుట, దోషములేవో దోషములేవికావో తెలిసికొనవలసిన బాధ్యతనుకూడ తాము గుర్తెరుగకుండుట, అసలు దోషాదోష విచారణ లేకుండనే ఒకనిమీద పగ సాధించుకొనుటకు వాని గ్రంథమునందు తప్పులున్నవని చెప్పుట, వాని కీర్తిప్రతిష్ఠలకు భంగము కలిగించవలయునన్న యూహతోనే ప్రవర్తించుట, ఈదృశములైన యెన్నిలక్షణము లుండరాదు ? వెలుతురున్నది. చీకటియున్నది. ఒకడు చీకటినే వెలుతురనును. అన్నవా డూరకుండక వెలుతురును వెలుతురని చెప్పెడివానితో విరోధము పెట్టుకొనును. ఈలోకము విచిత్రమైనది. చీకటిని వెలుతురని చెప్పి వాడేమి సాధించును? నిజముగా సాధించెడిది లేదు.

కాని వాడట్లు చెప్పి లోకమునందేదియో సాధించవలయునని వాని యుద్దేశము. లోకమునందొక ప్రయోజనమును సాధింపవలయునని చీకటిని వెలుతురని మొదలుపెట్టును. వానివెంట పదిమంది పడుదురు. వారిచేత తనపనులు చేయించుకొనును. మరికొంద రుందురు, వారి కూహయులేదు. భావన యుండదు. తనబంధువులలోనో స్నేహితులలోనో యొక మార్గమున పోవుచున్నవాడు వానికి లక్ష్యము. వాడు చెప్పినదే వీనికి వేదము. వాడు చేసెడిపనులకు నిజముగా పాపము వానికి బాధ్యత లేదు. కాని వానివలన నితరుల కపకారము జరుగుచునే యుండును. వీనిని పరిహరించుట యెట్లు? ఈలోకమొక పద్మవ్యూహము వంటిది. ఏ తీగ ఏ చిక్కులోనున్నదో తెలియదు.

ఇంక విమర్శింపబడెడువారు కలరు. వారందరు మహాకవులని చెప్పుటకు వీలులేదు. ప్రతివాడు తనకు తానొక కాళిదాసు. తాను వ్రాసినదే సిద్ధాంతము. తన్నెవ్వడును విమర్శించరాదు. విమర్శించినవాని కేమియు రాదు. అంతయు తనకే వచ్చును. ఈజాతి వారున్నారు. తానొకమాత్రపు కవి. నిజముగా నవతలివాడు చూపించిన దోషములు కొన్ని తన కావ్యమునం దున్నవి, కొన్ని లేవు. అన్నిటికిని కలిపి విమర్శకుని తూరుపోత పట్టును. ఇదియొక జాతి. మరియొకడున్నాడు. వాడు మంచికవియే. వానిని విమర్శించ నవసరములేదు. ఎవడో విమర్శించెను. దానికి పిడొడలు రక్కుకొని వీరావేశము తెచ్చికొని వీరంగము వేయును. మరింకొకడున్నాడు. అతడు సత్కవి, సాధువు, పరిజ్ఞానము కలవాడు. తిట్టుకో నిమ్ము మనకేమి యని యూరకుండును. ఇట్లే విమర్శకులలో నుందురు. వాడు తప్పులు వ్రాసినచో మనకేమి యని యూరకుండు నొకడు. ఈ విమర్శకుల లక్షణము పూర్వము చెప్పబడినదికదా! వారు వీరు తమకు తాము విచారించుకొని మాత్సర్యాదులు ప్రాధాన్యముగా పెట్టుకొనక గుణమును గుణమునుగానే చెప్పవలయును. దోషమును చెప్పినచో మంచిమార్గముననే చెప్పవలయును. వ్యక్తిగత ద్వేషాదులవలన మనజీవలక్షణమునందు మాయాధిక్యము కలుగుటయేగాక మన భాషాసారస్వతమునకు నష్టము కలుగును. మన దేశముయొక్క సౌభాగ్యమున కది మంచిదికాదు అన్న తాత్పర్యముతో ప్రవర్తించినచో ఏ రసానందము కొఱకు మనపూర్వులు కావ్యసృష్టి సంకల్పించిరో ఆ ఫలితము మును కొందరు కాకపోయినచో కొందరైనను పొందుదురు. ఈమాటలు జీవితమునందున్న ప్రతి శాఖకు సంబంధించి చెప్పవచ్చును. ఇది సారస్వత ప్రక్రియకుసంబంధించి చెప్పబడుచున్నది. రసోవై సః.

# శైష్యోపాధ్యాయిక | మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

సువిశాలదీర్ఘవిస్ఫూర్తి నేత్రములకుఁ
జూపులలో సూక్ష్మసూక్ష్మగతులు
వజ్రకాఠిన్యమ్ము వక్షస్థలమ్మునఁ
జిత్తమ్ములోఁ బువ్వుమెత్తఁదనము
విగ్రహమ్మునఁ బుట్టు వెడఁదయౌన్నత్యము
గురువులయెడ వంగికొలుచుభంగి
నడకలో స్వరములోఁ బొడముగాంభీర్యము
పేదవారలఁ జూచి ఖేదపాటు
పడుగుఁ బేకయుఁగా నేయబడినయట్లు
లలరి దేహాత్మగుణము లన్యోన్యమైత్రి
గృష్ణరాయలలో నందగించుచుండ
నరసి యాశీర్వదించుఁ దిమ్మరుసుగురుఁడు.

★

చదివినట్టులెయుండు సాహిత్యపాఠమ్ము ;
సంగీతకళకు నాసక్తినెఱపుఁ ;
జేసినట్టులెయుండుఁ జెలఁగి గుఱ్ఱపుస్వారి ;
చిత్తమ్మునకు వచ్చుఁ గత్తిసాము ;
వినినట్టులేయుండు వేదాంతవాదముల్ ;
దండనీతులకు వార్తలకు మఱియు ;
అలిగినట్లేయుండు నన్యాయములయెడఁ ;
జిఱునవ్వుమల్లియల్ కురియుచుండు ;
నరయుచున్నట్లెయుండు సుందరతరమ్ము
ప్రకృతిమంధరమైన శోభావిలాస ;
మంతలోఁ దనలోనఁ దా నరసి మఱియు ;
నపుడు రాయలలోనఁ దిమ్మరుసు మెఱయు.

★

నయనాంచలముల సన్నగఁ దోఁచుశోణరే
ఖలఁ జక్రవర్తిలక్షణముచెలువు
పరదారచరణ నూపురనిక్వణము నెంచి
మాతృభావమ్మున మసలుతెలివి
ఆజానులంబి బాహాయుగ్మమున మాంస
లతపెంపు లోరయుచెల్వపుఁబసందు
నెవఁ డెద్ది యాశించి యేతెంచినను జేతి
కెముక లేకుండఁగా నిచ్చు విందు
తమ్మివిరిమొగ్గ విచ్చిన దళములటులు
గొనము లీరీతి నాత్మశిష్యునకు విరియ
వేయి కరములతోఁ గృష్ణరాయ నొత్తి
మిత్త్రుఁడై తిమ్మరుసుమంత్రి మెచ్చు నతని.

★

దౌదౌల నిలఁబడి తగులమ్ము దిగనాడి
వ్యసనంబు లేడింటిపస లెఱింగి
మన మనాసక్తమై తనరఁ జతుర్విధ
మదనమార్గములసంపదలు తెలిసి
యనభిషంగతఁ దంత్రమునుగాంచి శృంగార
యువతీయువకరీతు లవధరించి
యంతరంగము పరార్థాభిలాషల నిల్పి
యష్టభోగముల తియ్యములు పట్టి
మెలగు నా రాచబిడ్డ రాయలవయస్సుఁ
దెలిసి, యాచట్టుసిగ్గువో దిటువుగొలిపి
వేడ్క దెందము పుష్పింప వీఁపుతట్టు
మంత్రిమాధవుఁ డల్ల తిమ్మరుసు బుధుఁడు.

తలఁగ్రుచ్చుకొన్నతెక్కలవంటి పంటకా
లువఁ బవ్వళించు బాతువుల నరసి
మొనసి కళ్ళనఁ బోసినకొల్పుఁ జేటల
విసరఁ బాఱినపొల్లువెంటఁ గాంచి
యొకకన్ను విద్రవో నొకకంట మేల్కను
వెలుఁగు సాలాగ్రమం దెసగఁ జూచి
వరిగింజనొకటఁ బల్వరుసఁ దోమెఱు కుంద
రదన కెంబెదవి హారంగుఁ దెలిసి
అవి వినూత్నకవిత్వవర్ణ్యాంశములుగఁ
గృష్ణరాయ లెదందఁ బొంగినపు డతవి
యభినవంబగుప్రతిభఁ దిమ్మరుసువిబుధుఁ
డరసి మోదాశ్రుకుందమాల్యములు విడుచు.

★

అతఁ డుచ్చరించు మహావాక్యములలోన
భావధ్వని వ్యంగ్యపరత మెఱసి
అతఁడు చూచినచూపునందు హైందవధర్మ
మర్మజ్ఞతారమ్యమహము తోనఁకి
అతఁడు వేసినయట్టియడుగులో గజపతి
గతి క్రిందుసేయుపద్ధతి చిగిర్చి
ఆతఁడు నవ్విననవ్వునందు నమ్లేచ్ఛమౌ
స్వచ్ఛపతాతికాచ్ఛవి తనర్చి
అతఁడు తన కౌఁగిటం జేరినపుడు చిటిలు
జాతి ముత్తెపు సరులలో శైత్య మెంచి
తిమ్మరుసుమంత్రి యంతరంగమ్ములోనఁ
గృష్ణరాయల దశ లపేక్షించుకొనును.

"ఆంధ్ర పురాణము" శ్రీకృష్ణదేవరాయపర్వమునుండి
సంగృహీతము.

# జీవుని వేదన-2
# వాల్మీకి వృత్తాంతము

ధూళిపాళ శ్రీరామమూర్తి

కావ్యపరమార్థము రసమని యాలంకారిక శిరోమణియగు నభినవ గుప్తపాదుఁడు నిర్ణయించెను. ఈ రసముయొక్క స్వరూపమేమి? ఇది పరిణతమైన జీవుని వేదన. అభినవ గుప్తుల సిద్ధాంతమును దఱువాతఁ బరిశీలింతము. ఆనంద వర్ధనాచార్యుఁడును నభినవగుప్తుఁడును దమ సిద్ధాంతమున కుపష్టంభకముగా వాల్మీకి వృత్తాంతము నుదాహరణముగా నొసంగిరి. ఈ యుదాహరణమును లెస్సగాఁ బరిశీలించిన వారు చెప్పిన రసము జీవుని వేదనా స్వరూపమని తేటపడఁ గలదు.

ప్రథమమున వాల్మీకివృత్తాంతమును దీసికొందము. వాల్మీకి యాదికవి. ఆయనకుఁ బూర్వము లౌకిక ఛందస్సు లేదు. ఆయనకుఁ బూర్వపు ఋషులెల్లరు మంత్రద్రష్టలే. వాల్మీకి కూడ వారివంటివాఁడే కాని యాయన వాక్కు లౌకిక ఛందో మార్గమును బట్టినది. అందుచేత నాయన కవియైనాఁడు. ఆయన కవియగుటకు జరిగిన సంఘటన మిది. ఆయన యొకనాఁడు శిష్యుఁడగు భారద్వాజునితోఁగూడి తమసానదికి స్నానమునకుఁబోయి సమీపమున నొకచెట్టుపై గూర్చుండి యున్న క్రౌంచమిథునమును జూచెను. అచటఁ బొంచి యున్న బోయవాఁడొకఁడు వానిలో మగపక్షిని బాణముతోఁ గొట్టెను. అది క్రిందఁబడి విలవిల తన్నుకొనుచుండెను. ఆడపక్షి దానిని జూచి దుఃఖముతో నరచుచుండెను. ఈవృత్త మంతయు వాల్మీకి కంటఁబడినది. ఆయనకు శోకముచే నొడలు తెలియలేదు. ఆయన నోటివెంట నప్రయత్నముగ నీక్రింది మాటలు వెలువడెను.

"మానిషాద! ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్॥"

(ఓరీ బోయవాఁడా! కామముతో నొడలెఱుంగక యున్న యీ క్రౌంచముల జంటలో నొకదానిని జంపితివి గావున నీ వెక్కువకాలము జీవింపవురా!) వాల్మీకి తననోటివెంట నిట్లాకస్మికప్రత్యవభాసముగ వచ్చిన పలుకుల కాశ్చర్య పడెను. ఆయన యించుక విచారించి తనశిష్యునితో నిట్లనెను. "పాదబద్ధోఽక్షరసమః తంత్రీలయ సమన్వితః శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా". తఱువాత నాయన స్నాన మాచరించి యీ సంఘటనమును గుఱించి చింతించుచుఁ దన యాశ్రమమునకు బోయి ధ్యానమగ్నుఁడై కూర్చుండెను. అప్పుడు బ్రహ్మ యాయనయొద్దకు వచ్చి రామాయణము కావ్యముగా వ్రాయుమని యాదేశించి యంతర్హితుఁడయ్యెను. ఇది సంగ్రహముగా వాల్మీకి వృత్తాంతము— వాల్మీకి కవి యైన కథ.

క్రౌంచద్వంద్వ వియోగదర్శనమున వాల్మీకి పొందిన శోకముయొక్క స్వరూపమును విచారింతము. ఇది జాయా పుత్రవియోగాదికము వలన లోకములో మన మనుభవించు శోకమువంటి దనుటకు వీలులేదు. మన మనుభవించు శోకము లౌకికము. సంబంధ సాపేక్షమైనది. ఈ లౌకిక శోకమునందుఁ దరతమభేద మనంతముగాఁగలదు. ఏ వస్తువును గుఱించి శోకించుచుంటిమో యా వస్తువుతో మనకుఁగల సంబంధమునుబట్టి.(యుపయోగమునుబట్టి, యనుబంధమును బట్టి) మన శోకమునందలి గాఢతయుండును. మన కేమాత్రము సంబంధములేనివారి కష్టములను జూచి మనము పొందు శోకము కరుణ యనఁబడును. దీనియందించుక యలౌకికాభాసయున్నది. కాని యిదియు నిరపేక్షముగాదు. ఇచ్చటఁ గూడ మనము శోకముతో నేకత్వమును సాధింప లేదు గావున మన హృదయములు తన్మయములగుటలేదు గావున నిదికూడ లౌకిక శోకమే యగుచున్నది. దీని నుండి యలౌకికశోకమునకు భేదమును స్పష్టము చేయుటకే దానికిఁ 'గరుణ' మని యాలంకారికులు సంకేత మేర్పఱచిరి. కరుణా శబ్దము స్త్రీలింగము. దానికి 'జాలి' యని యర్థము. ఈ జాలి లౌకిక కోటిలోఁ జేరినది. కరుణ శబ్దము పుంలింగము. దీని కలౌకికశోకమని యర్థము. వాల్మీకిపొందినది యిట్టి యలౌకిక శోకమని రామాయణమే మనకుఁ జెప్పుచున్నది. "తతః కరుణ వేదిత్వాత్" అని తఱువాత నున్నది కావున "ఋషే ర్ధర్మాత్మన స్తస్య కారుణ్యం సమపద్యత" యన్న వాక్యములోని కారుణ్య శబ్దమున కలౌకికశోకమని యర్థము చేయవలయును. జాలియని యర్థముచెప్పరాదు. అప్పుడు 'కరుణవేదిత్వాత్' అనుమాట కుదురదు.

మఱియొక రీతిగాఁ గూడ వాల్మీకి పొందినది యలౌకిక శోకమని సాధింపవచ్చును. వాల్మీకి శోకమును బొందినాఁడని మాత్రమే గ్రంథమున నున్నది. 'తస్య కారుణ్యం సమపద్యత' (అయనకు శోకము గలిగెను). వాల్మీకి గూడ "శోకార్తస్య ప్రవృత్తో మే" (శోకముచేత నార్తుఁడనైన నాకుఁ గలిగినది) అన్నాడు. ఈ శోకమెవరికిని సంబంధించినది గాదని యిందుచేత మనకుఁ దెలియుచున్నది. లోకములో జాయా శోకమని, పుత్రశోకమనియు మాత్రమే యనుభూతశోకము వ్యవహరింపఁబడుచున్నది. పట్టి భావరూపమగు శోకమును జెప్పుటకు మాత్రమే శోకశబ్దము వాడఁబడుచున్నది. 'వాఁడు చాలశోకములో నున్నాడు' ఇత్యాది ప్రయోగములలో శోకశబ్ద మౌపచారికము. ఎందుచేతననగా వాని శోకస్వరూప మెఱిఁగియున్న వారికి ప్రయోగమునందలి శోకశబ్దము తద్ధేతువునుగూడ స్ఫురింపఁజేయును. ఎఱుఁగని వారా శోకహేతువును బ్రశ్నించి తెలిసికొందురు. అందుచేత పట్టి శోకశబ్దమునకు ముఖ్యార్థమునందు లోకమునఁ బ్రయోగము లేదు. వాల్మీకి యనుభవించినది యట్టి పట్టి శోకము. భావరూపమైన శోకము. ఏ సంబంధమును లేనిది. నిరపేక్షమైనది. కావుననే 'కారుణ్యం సమపద్యత' 'శోకార్తస్య' యను ప్రయోగములు కుదురుచున్నవి.

ఇచ్చట నొక శంక. వాఁడు చాలశోకములో నున్నాడను ప్రయోగములోవలె నిచ్చటఁగూడ శోకశబ్దమునకు నుపచారము చెప్పఁగూడదా? యని. చెప్పఁగూడదని యుత్తరము. ఎందుచేతననగా ముఖ్యార్థబాధకలిగినప్పుడే శబ్ద ముపచరితమగును. ఇచట వాల్మీకి పొందినది యలౌకిక శోకమని చెప్పుటకు బాధకములేదు. అందుచేత ముఖ్యార్థబాధలేదు. మించి యాయనపొందిన శోక మలౌకికమే యనుటకు బలవత్తరమైన సాధకములున్నవి. 1. ఆయన ముని యగుట, 2. ఆయన నోటివెంట శ్లోకము వచ్చుట. వాల్మీకి ముని. సాంసారికబంధములను గోసికొన్నవాఁడు, లోకమునందు రాగద్వేషములు లేనివాఁడు, ఆయన కొకటి గలిగిన లాభమును, నొకటి పోయిన నష్టమును లేవు. క్రౌంచద్వంద్వముతో నాయనకెట్టి సంబంధమును లేదు, ఎట్టి యుపయోగమును లేదు. వానియం దొకదాని నాశమువలన నాయనకుఁ గలిగిన నష్టమునులేదు. అందుచేతఁ గ్రౌంచద్వంద్వ వియోగ మాయన శోకమునకుఁ గారణమనుటకు వీలులేదు. ఆయన శోకి యనుటకు వీలులేదు. ముని యనగా యోగియని యర్థము. మననముచేయువాఁడు మునియను వ్యుత్పత్తివలన యోగియనగాఁ జిత్తవృత్తుల నిరోధించువాఁడు. "యోగశ్చిత్తవృత్తినిరోధః" యని పతంజలి. చిత్తవృత్తినిరోధము యోగికిఁ బ్రథమలక్షణము. శోకమొక చిత్తవృత్తి. దీనిని నిరోధింపలేనివాఁడు వాల్మీకి ముని యెట్లగును? వాల్మీకికిఁ దన మునిత్వజ్ఞాన మున్నంతకాల మతఁడు శోకమనుభవింప లేడన్నమాట. అతఁడు శోకమనుభవింపవలెనన్నఁ దాను మునియన్నమాట మఱచిపోవలెను. తాను బొందునది శోకమనుమాట మఱచిపోవలెను. ఆ శోకమునకుఁ గ్రౌంచద్వంద్వ వియోగము విషయమన్నమాట మఱచిపోవలెను. ఈ త్రిపుటిని మఱచిపోవుట తన్నుదాను మఱచినప్పుడే సాధ్యమగును. ఇట్లు మఱువనంతకాలము జీవిపొందు దుఃఖము సాపేక్షమైనది. లౌకికమైనదియు నగును. వాల్మీకి మునియగుట వలన నిట్టి శోక మనుభవింపనేరఁడు. కావున నాయన యనుభవించినది లౌకికశోకమనుటకు వీలులేదు. ఇట్లు వాల్మీకి యొక్క మునిత్వ మాయన యనుభవించినది యలౌకిక శోకమనుటకు వినిగమకము.

మఱి రెండవది వాల్మీకి నోటివెంట వచ్చిన మాటలు శ్లోకరూపముననుండుట. ఆయన పొందినది లౌకికశోకమే యయినచో నాయననోటివెంట శ్లోక మెట్లువచ్చును? పుత్రమిత్రాది శోకపీడితుల నోటివెంట శ్లోకములు వచ్చుచున్నవా? వాల్మీకి చూచిన దృశ్యమును మనమును జూచితి మనుకొందము. మన మా దృశ్యమును జూచి జాలిపడవచ్చును. అప్పుడు మనము వాల్మీకి యన్నమాటలనే యనవచ్చును. "ఓరి కిరోకటకుఁడా! నీకేమి పోవుకాలము వచ్చినదిరా, ఆ పిట్ట నెట్లు కొట్టితివి" యందుము. వాల్మీకియు నిట్లే యన్నాడు. కాని యాయన యన్నమాటలకు మన మనుమాటలకు ముఖ్యమైన యొకభేదమున్నది. మన మను మాటలు లౌకికదశను దాఁటినవిగావు. అవి ఛందస్సుచేత నియతములై యుండవు. కాని వాల్మీకి యన్నమాటలు శ్లోకరూపమునునున్నవి. మనము పొందినది లౌకికానుభూతి కాబట్టి యది లౌకికభాషలో వ్యక్తమైనది. వాల్మీకి పొందినది కూడ లౌకికానుభూతియే యయినచో నది కూడ లౌకిక భాషలోనే వ్యక్తము కావలెను, అది యట్లుకాలేదు. శ్లోకములో వ్యక్తమైనది కావున నాయన పొందిన యనుభూతి మనము పొందిన యనుభూతికంటె వేరైనది. ఈ విషయ మంతయుఁ బర్యాలోచించి వాల్మీకియే "పాదబద్ధోఽక్షరసమః, తంత్రీలయసమన్వితః, శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా" యన్నాడు. ఈ శ్లోకమునందు వాల్మీకి తన నోటివెంట వచ్చినమాటల స్వరూపమును బరిశీలించినాఁడు. ఆ మాటలు నాల్గు పాదములుగానున్నవి. నాల్గు పాదములందును నక్షరములు సమముగానున్నవి. రాగ తాళ యుక్తములుగా నున్నవి. అందుచేత నవి శ్లోకమే కావలయునుగాని మఱి

యొకటికారాదు. లౌకిక శోకార్తున కిట్టిప్రవృత్తి లోకమున లేదు. లోకమునందేడ్చువారికి మాటలు ఛందోబద్ధములై రావు. ఏడుపు రాగతాళయుక్త మగుట మనము కన్నదిగాదు, విన్నది గాదు. అందుచేత వాల్మీకి యనుభవించినది యలౌకిక శోక మనుటకు ఛందస్సు, రాగతాళ సమన్వితత్వము నివి గమకములు. ఈ యలౌకిక శోకమే జీవునివేదన. జీవుని యొక్క స్వరూప మీ శోకము. సుఖదుఃఖానుభవము జీవుని యొక్క లక్షణము. ఈ సుఖముగూడఁ బర్యవసానమున దుఃఖమేయగును. సుఖదుఃఖాదులు ద్వంద్వములు. ద్వంద్వానుభవమంతయు దుఃఖమే. అందుచేత దుఃఖానుభవమే జీవలక్షణమనుట యుక్తము. జీవునియొక్క యీ దుఃఖానుభవము బాహ్యప్రపంచమునందలి పుత్త్రమిత్రాది వస్తువుల నాశ్రయించి యుండెనేని యది లౌకికశోకమగును. ఇట్టి యాశ్రయమును లేక యాజీవుఁడు తనస్వరూపమునందుఁ దానులగ్నమైనచోఁ దన స్వరూపమును దా ననుభవించు నప్పు డది యలౌకిక శోకమగును. లౌకికశోకము యత్కించి ద్విషయ విశిష్టము. అలౌకిక శోకము జీవస్వరూపమే. ఇట్టి జీవస్వరూప పరిజ్ఞానమే పరమమైన యార్తి. వాల్మీకి యనుభవించిన శోక మిట్టి పరమార్తి స్వరూపము. ఇదియే వాల్మీకికి శ్లోకరూపమునఁ బరిణమించినది.

మఱి యీ శోకమునందు శ్లోకరూపమునఁ బరిణమింప నేల? అది రాగతాళయుక్తము కానేల? ఆర్తి యిట్లు వ్యక్తమగుటకుఁ గల హేతువేమి? యన్నచో నిది జీవసంపుటిలోని విశేషమని చెప్పవలయును. ఈ యార్తి జీవునియొక్క స్వస్వరూపము. ఆ జీవుఁడు పరమేశ్వరుని యంశము. పరమేశ్వరుని ప్రతిబింబము. ఈప్రతిబింబ మా బింబముతో నెడబాటు గన్నది. జీవుఁడు తనకుఁ దెలియకుండ ననుభవించు పరమేశ్వరవిరహమే యీ యార్తి. ఈయార్తిలోఁ బరమేశ్వరుఁడున్నాఁడు. శ్లోకమునందలి సంగీత మా పరమేశ్వరుని వెలుఁగు.

భారతీయ కావ్యప్రపంచమందు వాల్మీకివృత్తాంతమునకున్న ప్రాముఖ్య మనంతము. కాళిదాస మహాకవి రఘువంశమునందు వాల్మీకివృత్తాంతమును జెప్పగా— బరామర్శించినాఁడు

'తా మభ్యగచ్ఛ ద్రుదితానుసారీ
కవిః కుశేధ్మాహరణాయ యాతః
నిషాద విద్ధాండజ దర్శనోత్థః
శ్లోకత్వ మాపద్యత యస్య శోకః' అని.

(బోయవానిచేఁ గొట్టఁబడిన పక్షిజాతి యొకఁడనుభవించిన శోకము శ్లోకముగాఁ బరిణమించెనో యట్టి కవి దర్భలను సమిధలను దెచ్చుటకు వనమునకుఁ బోవుచు రోదనము ననుసరించి యా సీతయొద్దకుఁ బోయెను.) ఇచట యస్యశోకః అను పదమునకు నెవనికి శోకమని యర్థము చేయవలెను. ఎవనియొక్క శోకమని యర్థము చేయరాదు. ఆయన యెఱిఁగి యనుభవించినప్పుడే యది యాయన శోకమగును. ఎఱిఁగి యనుభవించుట యనగా శోకమును విషయాశ్రితముగా ననుభవించుట. అప్పుడది శ్లోకముగాఁ బరిణమింపలేదు.

"కావ్యస్యాత్మా స ఏవార్థః తథా చాదికవేః పురా
క్రౌంచద్వంద్వ వియోగోత్థ శ్శోకశ్శ్లోకత్వ మాగతః"

ఈ శ్లోకమునకు వ్యాఖ్యానముచేయుచు నభినవగుప్తుడు 'కవేః' యను శబ్దమును శోకముతో నన్వయింపరాదనియు శ్లోకముతో నన్వయింపవలెననియుఁ జెప్పెను. 'కవే మునేః శ్లోక ఇతి మంతవ్యం' అని. ఆయన యనుభవించినది లౌకిక శోకమే యైనచోఁ గాళిదాసంతటివాఁడు వాల్మీకి కది యొక పెద్దవిశేషణముగా వేయనక్కరలేదు. ఆశోకము శ్లోకముగాఁ బరిణమించునట్టిది. అట్టి శోకము గలవాఁడు కావుననే యాయన కవి. అందుచేతఁ గవియనగా నలౌకిక శోకము ననుభవించువాడు. జీవుని వేదనానుభవముగలవాఁడని కాళిదాసుని యభిప్రాయమని మనము గ్రహింపవలెను. 'యస్య-శోకః శ్లోకత్వ మాగతః సః కవిః యస్య-శోకశ్శ్లోకత్వం గచ్ఛతి - శ్లోకరూపేణ పరిణమతి స ఏవ కవిః' 'తస్మాత్కవిర్నా మాలౌకికశోకవాన్' అని పైశ్లోక పాదముయొక్క తాత్పర్యము-వాల్మీకి యట్టిశోకము గలవాఁడు గావుననే 'రుదితానుసారి' యైనాఁడు. ఆయన యెవ్వట నేడ్పువిన్నను జీవ వేదనను బొందును. ఆ జీవవేదనాస్వరూపమును మూర్తీభవించినది సీతాదేవి. రుదితానుసారియైన యా వాల్మీకి సీతాదేవిని దర్శించెను.

వాల్మీకి యాదికవి. ఆయన కవియగుటయేగాక సహృదయుఁడు గూడ. ఆకవిత్వముయొక్క స్వరూపమిట్టిదని చెప్పినవాఁడు. ఆయనమండి యొకే మాఱు కావ్య సంప్రదాయము, తదనుశీలనాసంప్రదాయమును పుట్టినవి. అందుచేత నాయన మొట్టమొదటి కవి సహృదయుఁడు. కవిసహృదయుఁడనగా మహాకవియన్నమాట. మహాకవికే సరస్వతీత్వము ప్రకాశితమగును. ఆ సరస్వతీత్వము జీవునివేదన.

# "మంజుశ్రీ" | వానలో తడుస్తున్న మనిషి

దురాశల అవలి తీరాలు చేరుకున్న తర్వాత మనిషి. చిన్నతనంలోనే జీవితంలో మమకారాలు వదుల్చుకున్నవాడు. అమ్మ గుర్తువస్తే తప్ప యెప్పుడూ కన్నీళ్ళు రానివాడు. ఎఱుపురంగు పూసుకున్న పోస్టుడబ్బాలు కనపడితే భయపడే వాడు. వీథివెంట నడుస్తున్నాడు. తుడిచిపెట్టిన అద్దంలా వున్న సూర్యుడు కనపడటం లేదు. వాన వచ్చేలా వుంది. వానంటే భయం అతడికి. వానలో తిరగకూడదని, అనగా తడవకూడదని ప్రతిసారీ జబ్బుపడ్డప్పుడు చెప్పేవాళ్ళు మందులిచ్చేవాళ్ళు.

చిన్నప్పుడెప్పుడో కుక్క కరచిందతణ్ణి. అది పిచ్చికుక్క అన్నారెవ్వరో. అమ్మ కావిలించుకుని యేడ్చింది.

వానవచ్చే సూచనలు కనపడితే తాడుపెట్టి కట్టే సేది చిన్నతనంలో. సెనగలు తిననిచ్చేదికాదు. కుక్క కరచినవాళ్ళు వానలో తడవకూడదట. సెనగలు తినగూడదట.

పెద్దవా డవుతున్నకొద్దీ చాలమంది కరిచారతణ్ణి.

పరీక్షలు తప్పాడు. అందుకు యెప్పుడూ ఏడవ లేదు!

అమ్మ యేడ్చింది. నానా అడ్డమైనవాళ్ళ దగ్గర నుంచీ చాలా చాలా గొప్పవాళ్ళ వరకూ వట్టి అప్రయోజక శిఖామణివి - అన్నారు.

ఎవరిముందూ కాదనలేదు. కొందరిముందు అవునన్నాడు.

చిన్నప్పుడెప్పుడేనా క్లాసులో కూచుని పాఠాలు చెబుతున్న మాస్టర్ల హావభావ విలాసాలను బొమ్మలు గీసేవాడు. దెబ్బలు తిన్నాడు.

కాలేజీకి వచ్చిన తర్వాత, పాఠాలు చెపుతుంటే వొళ్ళో పెట్టుకుని తలవంచుకుని, నవలలు చదివే వాడు.

ఆ తరువాత కథలు వ్రాశాడు. అమ్మనిగురించి కూడా వ్రాశాడు. అమ్మ, అన్నది వోసారి-మామయ్యగారింటికి వెళ్ళు. శకుంతల నిన్ను చూడాలనుకుంటోందట. నిజమే ననుకొన్నాడు. మామయ్యగారింటికి వెళ్ళాడు. శకుంతల పరీక్షలు ప్యాసైంది. చాలా అందంగా ఉంది.

వారంరోజు లున్నతరువాత రేపు తిరిగి వద్దామనుకొంటుండగా, రాత్రి వెన్నెల వచ్చింది. వెన్నెట్లో చెట్లు. వెన్నెల బావుంది.

చంద్రకాంతపు మొక్క లున్నాయి. గోడ వారగా ఐదో, ఆరో అన్ని మొక్కలకీ ఒక్క పువ్వే వుంది.

"అవి కోయలేదేం"—అని అడిగాడు శకుంతలని.

"తల్లిచెట్టుకి వొక్కొక్క పువ్వైనా వుంచాలి" అని చెప్పింది శకుంతల.

గదిలో కూచున్నారు కిటికీలోంచి రోడ్డు దూరంగా కనిపిస్తున్నది దూరంగా రోడ్డుమీద కంకర కొడుతున్న కూలివాళ్లు పాటలు పాడుకుంటున్నారు.

"రేపు వెళ్ళిపోతున్నాను" అని చెప్పాడు.

చాలా సేపు మాటాడకుండా వుండి, చివరకిలా అన్నది శకుంతల.

"వాళ్ళు నయం బావా నీకంటే. చాలానయం"

"ఎవరు వాళ్ళు."

"అదే దూరంగా రోడ్డుమీద కంకర కొట్టుకుం టున్నారే. వాళ్ళు దేశానిక్కూడా నీలావిషాద ప్రేమ కథలూ, నగ్నచిత్రాలూ రచించేవాళ్ళ కంటే వాళ్ళే ఉపయోగం."

తెల్లవారిన తరువాత ఊరెళ్ళిపోయినాడు. మళ్ళీ మామయ్యగారింటికి పోలేదు.

తరువాత యెప్పుడో శకుంతలకి పెళ్ళయింది.

చాలానాళ్ళ తరువాత స్టేషన్లో కనపడింది. ఇద్దరు పిల్లలూ, తానూ. దిగులుగా నవ్వుతూ "పెండ్లి చేసుకోవద్దు బావా, అదృష్టవంతుడివి కావాలంటే" అని చెప్పింది.

త్వరత్వరగా వెళ్ళిపోయాడు. ఇంటికి పోయిన తర్వాత 'ఇద్దరుపిల్లల తల్లి'—అని బొమ్మగీశాడు. అసహ్యంగా లావయి, చెక్కిళ్ళు గుంటలుపడి, ముఖం ముడతలుపడి. దిగులుగా నవ్వుతూ.

తరువాత యెన్నో వానలు కురిశాయి.

కిటికీతలుపులు కూడా మూసుకుని భద్రంగా గదిలో కూచున్నాడు. నాన్నకు విసుగ్గా వుంది. అమ్మకి దుఃఖంగా వుంది. పరీక్షలకి చదవటంలేదు.

ఇంట్లో వుండలేక "ఉద్యోగం చేస్తా"నన్నాడు.

"ఎవరిస్తా"రన్నాడు నాన్న వెటకారంగా.

అమ్మ పాదాలు కళ్ళకద్దుకుని మహానగరం వచ్చాడు కుట్టివాడు. పత్రికలలో కథలు పడు తున్నాయి.

బొమ్మలు గీస్తున్నాడు.

ఎక్కడో పాడుపడ్డ కొంపలో బాగున్న గదిలో రాత్రుళ్ళు పడుకుంటాడు. వీధిపేరు అతడికి తెలీదు. వీధిపేరు తెలుసుకుంటే, ఇంటి నెంబరు గుర్తుంటే, అమ్మ దగ్గరనుంచి ఉత్తరం వస్తుంది. అందుకే వీధిపేరు తెలుసుకోలేదు. ఇంటికి ఉత్తరం వ్రాయ లేదు. పోష్టు డబ్బాలు చూస్తే అందుకే భయం. ఉత్తరాలు గుర్తువస్తాయి. అమ్మ గుర్తొస్తుంది. ఎన్నో గుర్తొస్తాయి. బ్రతుకుతున్నానన్న విషయం గుర్తొస్తుంది. వానచినుకులు గుర్తువస్తాయి.

ఎప్పుడేనా గోవిందు వెతుక్కుంటూ వచ్చి కథ పడ్డ పత్రిక యిస్తాడు. పది రూపాయ లిస్తాడు. ఎప్పుడేనా. ఇంకో పది కావాలన్నా యిస్తాడు.

క్రిందటిసారి వానలో తడిసి మూడు నెలలు కాలేదు. ఆస్పత్రినుంచి వచ్చి రెండు నెలలు కాలేదు.

మళ్ళీ వాన వచ్చేలా వుంది. అందుకే కుట్టివాడు గబగబా నడుస్తున్నాడు. అది బజారువీధి కాదు. పళ్ళ దుకాణాలుకూడా లేవు. కిళ్లీషాపులు కూడా లేవు. అందుకే కుట్టివాడు గబగబా నడుస్తున్నాడు. అతడి పేరు ముకుందరావు. మహానగరంలో వున్నాడు. ప్రస్తుతం వీధివెంట నడుస్తున్నాడు. ప్రస్తుతం ముకుందరావు వానలో తడిసేలోపున, క్రిందటిసారి వానలో తడిసినవిషయం - ఇదికథ.

రోడ్డుమీద పరిగెత్తినా ముద్దముద్దగా తడిసిన ముకుందరావు పాడుపడ్డ ఇంటిలోని బాగున్న గదిలో ఆ రాత్రి పడుకుంటే పొద్దునకల్లా వొళ్ళు నొప్పులు పుట్టి జ్వరం వచ్చింది.

ముకుందరావు, గోవిందరావు ఇంటికి వెళ్ళాడు. నడిచే వెళ్ళాడు. జేబులో చిల్లగడబ్బులు లేక - గోవిందరావు, భార్య బయటజేరితే చచ్చినట్టు కుంపటి రాజేసుకుంటున్నాడు.

ముకుందరావు వెళ్ళి జ్వరం వచ్చిందిరా గోవిందూ - అని చెప్పాడు. గోవిందరావుకి కళ్ళ నీళ్ళువచ్చినయ్, కుంపటిరాజుకోక. భార్యని తిట్టు కుని, తననితాను తిట్టుకుని, ముకుందరావుని తిట్టి, ఆఫీసునితిట్టి, రిజా మాట్లాడి పక్కనే కూచోబెట్టు కుని, ఆస్పత్రికి చేర్చి "వీడుచస్తే నాకు కబురు చేయండని" డాక్టరుగారికి చెప్పి వెళ్ళిపోయాడు. ముకుందరావుకి యీసారి ఆస్పత్రి బావుంది. ఈ రోగం పెద్దదయితే, తగ్గిపోయిందాకా, హాయిగా ఇక్కడే వుండునుకదా - అనుకున్నాడు.

రెండురోజులు పోయింతర్వాత గోవిందరావు వచ్చాడు.

ఇంటికి ఉత్తరం వ్రాశాడట అమ్మ ఉత్తరం వ్రాసింది. తెచ్చియిచ్చాడు. ముకుందరావు చదవ లేదు - ఆ ఉత్తరంలో యే ముంటుందో అతడికి తెలుసు.

మళ్ళీ రెండురోజులు పోయినతర్వాత గోవింద రావు వచ్చాడు. నాన్న డబ్బు పంపించాడట. ఇచ్చి పోయాడు.

ఆ సాయంకాలం నర్సువచ్చి "నెలరోజులదాకా ఇక్కడే వుండాలి మీరు" అని చెప్పింది.

"న్యుమోనియాలోకి దించుతుందేమోనని భయంగా వుంది" అని చెప్పింది.

"భయమెందుకు ? అన్నాడు ముకుందరావు.

నర్సు తెల్లబోయింది. కళ్ళు విప్పార్చుకుని విచిత్రంగా చూసింది. అలా చూడటం ముకుందరావుకి బాగుంది. చిన్నప్పుడు శకుంతల ఆలానే చూసేది. ఆస్పత్రి విషయాలు యెన్నో తెలుసు నతడికి.

పేరేమిటని అడిగాడు నర్సుని ఎందుకు? అన్నది. చెప్పనవసరం లేదులే - అన్నాడు.

'అయితే చెపుతున్నాను. సరోజిని...'

"ఈ ఉద్యోగం యెందుకు చేస్తున్నావు ?" చాలారోజులతర్వాత ఆమె యీ ఉద్యోగం చెయ్యటం ఇష్టంలేనివాడులా అడిగాడు. ఆమె దిగులుగా చూసి వెళ్ళిపోయింది. నాలుగురోజులు ఆ ప్రశ్నని మరచిపోయాడు. ఏదో రోజున అడిగాడు. "ఈ ఉద్యోగం యెందుకు చేస్తున్నావు ?" ఆమె దిగులుగా వెళ్ళిపోయినది. తరువాత ప్రతిరోజూ అడిగాడు ఆమె చెప్పలేదు. అడిగేవాడు. ఆమెకు కోపం వచ్చింది. "ఇలా అడిగితే యీ వార్డునుంచి డ్యూటీ మార్పించుకుంటాను."

"ఉద్యోగమే మానేయరాదూ"

ఆమె మౌనంగా వెళ్ళిపోయింది. మర్రోజు రాలేదుఆమె. ఆమరురోజు రాలేదు. మూడోరోజూ రాలేదు. ముకుందరావు సంతోషించాడు. నిజంగామె ఉద్యోగం మానేసిందని.

ఆమె బావుంది. ఆమె చాలా మంచిది. ఎందుకో ఆమె యీ ఉద్యోగం చెయ్యటం, అతడికి ఇష్టం లేదు. వారంరోజులు తర్వాత, ఓరోజు సాయంకాలం దీపాలు వెలిగిన తర్వాత. ఆరుగంటల తర్వాత—

రోగులను చూడటానికి వచ్చిన వాళ్ళ వాళ్ళ బంధువులంతా దిగులైన ముఖాలతో వార్డులోంచి వెళ్ళిపోయినతరువాత ఆమె వచ్చింది.

గోవిందరావు వెళ్ళిపోయాడు. అమ్మవ్రాసిన ఉత్తరం చదువుకుంటున్నాడతడు. ఆమె వచ్చింది. ఉత్తరం దిండుకిందదాచి ఆమెకేసి చూశాడు.

కళ్ళు తుడుచుకుని చూసిన తర్వాత ఆమె ఆమెగా కన్పించిందతడికి. మళ్ళీ వచ్చింది. నిమిషం సేపు తలవంచుకుని చిరునవ్వు తెచ్చిపెట్టుకుని "తప్పకుండా తగ్గిపోతుందిలెండి. భయపడకండి" అని చెప్పింది ఆమె.

"భయమెందుకు ?" అన్నాడతడు.

ఆమెకు దిగులైంది. వెళ్ళిపోయింది.

ఆమె యేదో అడగాలని వచ్చింది. 'ఎక్కడ నుంచి ఆ ఉత్తరం' అని.

"ఉద్యోగం మానెయ్యలేదూ" అని అడిగాడతను.

ఆమె తలవంచుకుని వెళ్ళిపోయింది. అతడు కళ్ళుతుడుచుకున్నాడు.

రాత్రి నిద్రపొమ్మని చెప్పటానికి వచ్చినప్పుడు మళ్ళీ అడిగాడు "ఉద్యోగం మానేయరాదూ" అని. ఆమె నవ్వింది. "మానేస్తాను. పోనీ మీరు చెప్పండి. భోజనం మీరు పెడతారా."

అతడు ఆలోచనలో పడ్డాడు.

ఆమే అతడివేపు కాసేపు వుత్సుకతతోచూసి. గుండెలవరకూ దుప్పటిలాగి వెళ్ళిపోయింది.

అతడు పిలిచాడు.

వినిపించుకోకుండా "నిద్రపోండి. పక్కగది లోనే వుంటాను. అవసరమైతే పిలవండి" అని ఆమె వెళ్ళిపోయింది.

ఐదు నిమిషాలు కాకముందే అతడు పిలిచాడు. ఆమె వచ్చింది. "ఉద్యోగం మానెయ్యరాదూ."

ఆమె నవ్వింది. దిగులుగా అందంగా, ఆహ్లాదకరంగా. "మిమ్మల్ని ఇక్కడనుంచి ఇంకో ఆస్పత్రికి మార్చమని డాక్టరుగారికి చెప్పనా."

"ఎందుకు ?"

"పిచ్చాసుపత్రికి" అతనూ నవ్వాడు. ఆమె వెళ్ళిపోయింది. నడిరాత్రివేళ అతడికి మెలకువ వొచ్చింది.

ఎదురు బెడ్‌మీద చిన్నకుఱ్ఱవాడెవడో యేడుస్తున్నాడు. వాడికి పదేళ్ళుండవచ్చు. ఎవరికీ వినపడకూడదన్న ఉద్దేశంతో యేడుస్తున్నాడు. కాని ఆపుకోలేక పోతున్నాడు. ఎంత ఆపుకుందామనుకున్నా వెక్కిళ్ళు ఆగటంలేదు. మధ్యమధ్య అమ్మా అమ్మా అంటున్నాడు.

ముకుందరావు ప్రయత్నించి కొద్దిగాలేచి వెన్నెముకక్రిందికి దిండ్లులాగి పడుకున్నాడు. కుఱ్ఱాడివేపు చూస్తున్నాడు. కుఱ్ఱాడు యేడుస్తున్నాడు. అమ్మా, అమ్మా, అంటున్నాడు. ముకుందరావుకి కళ్ళలో నీళ్ళు తిరిగినవి. పక్కకుతిరిగి, కిటికీలోంచి రోడ్డుమీదకు చూశాడు. చుట్టూ కలయచూశాడు. కొంతమంది నిద్రపోతున్నారు. కొంతమంది మూలుగుతున్నారు. కుఱ్ఱవాడు యేడుస్తున్నాడు. కిటికీలోంచి కనిపిస్తున్న రోడ్డుమీద వెన్నెల కురుస్తున్నది. ముకుందరావు చూశాడు. అమ్మా, అమ్మా, అంటున్నాడు కుఱ్ఱాడు. ముకుందరావుకి అమ్మ గుర్తువచ్చింది. అమ్మ యేంచేస్తుంటుంది? పక్కమీద నిద్రపట్టక కన్నీళ్ళు పెట్టుకుంటుంది. దేవుడికి మొక్కుకుంటుంది.

ఆస్పత్రినుంచి వెంటనే బయటపడాలని, ఉద్యోగం దొరకాలని పెండ్లికావాలని, కోడలు రావాలని.

ఇంకా, ఇంకా,

ముకుందరావు కళ్ళు తుడుచుకున్నాడు.

రోడ్డుమీద రిక్షాపోతోంది. గంటలు మ్రోగించుకుంటూ.

"ఇంకా నిద్రపోలేదూ."

ముకుందరావు వెనక్కు తిరిగిచూశాడు.

"నిద్రపొండి. లేకపోతే ప్రొద్దునకల్లా టెంపరేచర్ మళ్ళీ యెక్కువవుతుంది.

ముకుందరావు అడుగుదామనుకున్నాడు.

"ఈఉద్యోగం మానెయ్యరాదూ" అని.

కాని ఆమె అక్కడనుంచి వెళ్ళిపోయింది ఎదురు బెడ్‌మీది కుఱ్ఱాడిదగ్గరకు. ముకుందరావు ఆమెవేపే చూస్తున్నాడు.

"ఎందుకమ్మా యేడుస్తున్నావు? నాతండ్రి కదూ, అమ్మ గుర్తువచ్చిందా, ఇదిగో ఇటుచూడు, నేనే అమ్మననుకో. బావుందా యేం." వాణ్ణి గుండెల కదుముకుని వోదారుస్తోంది. వాడు యేడుపు మానేశాడు.

ఎక్కువ కాంతిలేని ఆలైట్లవెల్తురులో ముకుందరావు, ఆమెవేపే చూస్తున్నాడు. ఆమె కాంతిమంతగా కనిపిస్తోంది. అమ్మ గుర్తువచ్చింది.

వెన్నెముక నొప్పి పుడుతున్నది. పడుకోవాలి. పడుకుంటే ఆమె కనపడదు. ముకుందరావు అలానే వున్నాడు.

పది, పదిహేను నిమిషాల్లో కుఱ్ఱాడు నిద్రపోయినాడు. వాణ్ణి పడుకోబెట్టి ఆమె లేచింది. ముకుందరావు దగ్గరగా వచ్చింది.

"నిద్ర రావటంలేదూ—"

...............

"నా ఉద్యోగం గురించే ఆలోచిస్తున్నారా ?"

...............

"పోనీ మానేస్తాను. నిద్రపోతారా ?"

ముకుందరావు మాట్లాడాడు "ఒకటడుగుతాను చెబుతావా ?"

"ఒకటికాదు, పది అడగండి. మీకు నిద్రైనా పడుతుందేమో."

"నీకు నిద్రరాదూ"

"ఛఠే ప్రశ్న !"

"నువ్వెప్పుడైనా పాపం చేశావా?" ఆమె వణికిపోయింది. ముకుందరావు చూశాడు. ఆమె కళ్ళు తుడుచుకోవటంలేదు. ముకుందరావు రోడ్డు మీదికి చూశాడు. వెన్నెల మబ్బుతెరల్లోంచి పాలిపోతోంది.

"నీకు రుక్మిణీకళ్యాణంలో పద్యాలు వచ్చునా" ఆమె నిశ్శబ్దంగా వొక్కొక్క అడుగే వేసుకుంటూ వెళ్ళిపోతోంది. దిండ్లు మెడకిందికి లాక్కుని ముకుందరావు పడుకున్నాడు. అతనికి నిద్ర పట్టటం లేదు.

ఆమె వెళ్ళి గదిలో కుర్చీలో కూర్చుని కళ్ళు తుడుచుకుంది. ఆమె ఆలోచిస్తున్నది.

"ఏమిటీ వింతమనిషి, పిచ్చివాడా? అన్నీ వివరాలు తెలిసికోవాలె, ఇతడిగురించి." ఆమెకు ఇంతలోనే అసూయ కలిగింది. తనకెందుకు? తెలిసికొని తానేం చేస్తుంది? ఇంకో పదిరోజుల్లో యెలాగూ వెళ్ళిపోతాడు. ఇల్లు, సంసారం, భార్యను చూస్తాడు. ఆమె అతణ్ణి చూచి భోరుమంటుంది. ఎలా, అయిపోయారు? అటుంది తర్వాత అతడు తనని మరచిపోతాడు. ఆమె అలానే ఆలోచిస్తున్నది. తమ్ముడు గుర్తువచ్చాడు. తమ్ముడికీఊరు ట్రాన్స్‌ఫర్ కావటం నయమే. తాను ఉద్యోగం మానేస్తుంది. తమ్ముడూ-మరదలూ వాళ్ళ మధ్య ఒంటరిగా తానెలా బ్రతుకుతుంది! తమ్ముడికి చదువు చెప్పించింది. లేకపోతే యీ ఉద్యోగం తనకెందుకు! వాడు ఉద్యోగంలో చేరాడు. తనని ఉద్యోగం మానేయమనడేం. పెళ్ళి చేసుకున్నాడు. తనని పెళ్ళి చేసుకోమనడేం! ఎప్పుడేనా పాపం.... ఏమో తనకు తెలీదు. ఆమె టేబిల్ మీద తల ఆన్చి ఆలోచిస్తుంది.

ముకుందరావుకి నిద్ర పట్టటంలేదు.

"ఆమె యెందుకు ఉద్యోగం చెయ్యాలి. ఆమె భర్త యేమనుకుంటాడు. జీవితం ఎన్నాళ్ళిలా గడపాలి. 'ఇద్దరు పిల్లలతల్లి' లా ఆమె మాత్రం అయిపోదూ ఎన్నాళ్ళిలా.... ఎన్నాళ్ళిలా.... ఏమిటీ జీవితం?"

మర్రోజు ప్రొద్దున్నే ముకుందరావు కాగితం, కలం తీసుకున్నాడు. టెంపరేచర్ నార్మల్‌లో వుంది.

సాయంకాలం ఆమె వచ్చింది సంతోషంగా వచ్చింది. "మీకు జ్వరం తగ్గిపోయింది. టెంపరేచర్ చార్ట్ చూసివచ్చాను. నాలుగు రోజుల్లోనే మీరిక్కడనుంచి హాయిగా వెళ్ళిపోవచ్చును."

ముకుందరావు నవ్వాడు.

ఆమెకు తాను గీసిన బొమ్మ చూపాడు.

"ఉద్యోగం వదిలేసిన నర్సు"

ఆ బొమ్మలో తానేవుంది. ఎవరో మగవాడు. తనచుట్టూ ఇద్దరు ముగ్గురు పిల్లలు. వాళ్ళను పిల్లలనుకోవాలి రేఖలు.

ఆమెకు సంతోషమైంది. అతడికేసి ఆశ్చర్యంగా కళ్ళు విప్పార్చుకొని చూచి "మీరు బొమ్మలు బాగా వేస్తారే!"

ఇంకా కళ్ళు పెద్దవిచేసి "నాకు ఇల్లులేదు. సంసారం లేదు, పెళ్ళికాలేదు తెలుసా?" ఆమె వెళ్ళిపోయింది, ఆ బొమ్మగీచిన కాగితం జాగ్రత్తగా తీసుకుని, పోతూపోతూ "ఇది నాకు కావాలి"

ముకుందరావుకి ఆశ్చర్యమైంది, సంతోషం కలిగింది. ఆవాళ రాత్రి ఎదురు బెడ్‌మీద వున్న కుఱ్ఱవాడు మళ్ళీ యేడ్చాడు ఆమె వచ్చింది. "ఎందుకమ్మా యేడుస్తున్నావు? నేనే అమ్మననుకో." ముకుందరావు ఆమెవేపు చూస్తున్నాడు. రోజూ కుఱ్ఱవాడు యేడుస్తున్నాడు. రేపు వెళ్ళిపోతాననగా, ఆ రాత్రి ఆమెచేతిని కావాలని మృదువుగా నొక్కి హాయిగా నిద్రపోయాడు ముకుందరావు. ఇది క్రిందటిసారి వానలో తడిసిన కథ. ఇప్పుడు.

ముకుందరావు రోడ్డుమీద నడుస్తున్నాడు. బ్రిడ్జి వచ్చింది. బ్రిడ్జి దాటాడు. ఏవీ దుకాణాలు లేవు. గవర్నమెంట్ క్వార్టర్స్ కనిపిస్తున్నాయి. ఒక పెద్ద చినుకు వచ్చి మీద పడింది. ముకుందరావు పరుగెత్తాలనుకున్నాడు, నడుస్తున్నాడు. గాలి చల్లగా

శరీరాన్ని తాకుతున్నది. మీద రెండు చినుకులు పడ్డాయి. ముకుందరావు గబగబా నడుస్తున్నాడు నాలుగు చినుకులు పడ్డాయి. ముకుందరావుకి హాయిగా నేవుంది. అయినా భయంగావుంది. ఇంకా నడక వేగం హెచ్చించాడు.

వీధిలో దీపాలు వెలిగాయి. చీకటి పడుతున్నది. వాన కురవబోతున్నది. ఒకచెట్టు కనపడుతున్నది. ఆ చెట్టుకింద అప్పటికే ఒకరు నిలుచుని వున్నారు. చిన్న పళ్ళెంలో యేవో అమ్ముకునేవాడులావుంది. ముకుందరావుపోయి పక్కనే నిలుచున్నాడు. చినుకులు పడుతున్నాయి. ముకుందరావుకి విసుగ్గా వుంది. ఎదురుగా క్వార్టర్సు కనపడుతున్నాయి. క్వార్టర్సులో దీపాలు కనపడుతున్నాయి. వాన కురుస్తున్నది తనపక్కన నిలుచున్న మనిషి వేపు చూశాడు అతనిపైన చినుకులు పడటంలేదు. అతని చేతల్లోని పళ్ళెంవేపు చూశాడు. వేయించిన సెనగలు వున్నవి. ముకుందరావు జేబు తడుముకున్నాడు. ముకుందరావు పక్కన నిలుచున్న మనిషి పక్కకి జరిగాడు. ముకుందరావు సెనగలు కొనుక్కొని జేబులో పోసుకున్నాడు. ఇప్పుడు ముకుందరావుమీద చినుకులు పడటంలేదు. పక్కనున్న మనిషి పళ్ళెంమీద గోనెపట్టా కప్పుకుని క్వార్టర్సువేపు పరుగెత్తాడు. ముకుందరావుకి హాయిగావుంది ఒక నిమిషం, రెండు నిమిషాలు వాన పెద్దదైంది. ముకుందరావు క్వార్టర్సువేపు పరుగెత్తాడు.

సెనగలమ్ముకుంటున్న మనిషి యే యింట్లోనూ కనిపించలేదు. అన్ని వాకిళ్ళూ మూసి వున్నాయి. ముకుందరావు తడుస్తున్నాడు. వాన పెద్దదైంది.

చప్పున వో ఇంటిదగ్గర ఆగిపోయాడు. వాకిలి తెరిచేవుంది. గడపలో నిలుచున్నాడు. వాన మీద పడటంలేదు. జేబురుమాలుతో తల తుడుచుకుంటూ ఇంట్లోకి చూశాడు. లైటు వెలుగుతోంది. సోఫాలో ఎవరో అమ్మాయి కూచుని కథల పత్రిక చదువుతోంది. ఆ అమ్మాయి ముకుందరావు వేపుచూసింది. కళ్ళలో యెంతో అసహ్యం. ఆ అమ్మాయి తన వేపు చూడటంలో, ఆ అమ్మాయి చదువుతున్న కథ వేపు చూశాడు ముకుందరావు. చిత్రం. ఆ కథ తాను వ్రాసిందే. ఆ అమ్మాయి మళ్ళీ చదువుకుంటోంది. ఆ అమ్మాయి వేపు చూశాడు. ఆ అమ్మాయి ముఖం దీనంగా మారిపోయింది. ఆ దుఃఖ గాధను తలచుకుని, ఆ అమ్మాయిని చూస్తూ ముకుందరావు చెప్పలేనంత సంతోషపడ్డాడు. ఆ అమ్మాయి చప్పున ఇతడి వేపు తిరిగి "పక్కన వరండా వుంది అక్కడ పోయి నిలుచోండి...." ముకుందరావుకి దిగులైంది. ఆ కథ తాను వ్రాసిందే! ముకుందరావు కదల బోయాడు.

వెనకనుంచి "ఓ...మీరా..."

క్షణంసేపు ఆగి "వానలో తడుస్తున్నారా" కోపంతో కూడిన లాలనతో.

ఆమె సరోజిని. అప్పుడే లోపలినుంచి వచ్చింది.

"కూచోండి టవల్ తెస్తాను. మా మరదలే లెండి...నువు పోయి కాఫీ కలుపమ్మా..."

ముకుందరావు గోడవారగా నిలుచున్నాడు. సరోజిని మరదలు లోపలకు వెళ్ళింది. చాలా ఆశ్చర్యంతో, కొంచెం బాధతో, కొంచెం సిగ్గుతో.

"మీ కథను రోజూ చదువుతుంది. చాలా ఇష్టం ఆవిడకు." ముకుందరావు మాటాడలేదు.

"నేను ఉద్యోగం మానేశాను తెలుసా?". ఆమె నవ్వుతోంది.

"ఇప్పుడు చెప్పండి. నాకు భోజనం యేర్పాటు చేస్తారా?"

ముకుందరావుకి సంతోషమైంది. సరోజిని టవల్ తెచ్చియిచ్చి లోపలకు వెళ్ళిపోయింది. ముకుందరావు తుడుచుకోవటం లేదు. ముకుందరావుకి యెన్నెన్నో గుర్తు వస్తున్నాయి. అమ్మకు ఉత్తరం వ్రాయాలి. రెండు రోజులక్రితం గోవిందు చెప్పిన ఉద్యోగం విషయం గట్టిగా కనుక్కోమని చెప్పాలి. ఉత్తరం...ఉత్తరం. అమ్మకు...ముకుందరావు కాసేపు సరోజిని నిష్క్రమించిన వాకిలివేపు చూశాడు. లోపల స్టవ్ మండుతోంది. ఆ అమ్మాయి వదిలేసిపోయిన పత్రిక వేపు చూశాడు. బయట కురుస్తున్న వానవేపు చూశాడు. ముకుందరావు ఆలోచించుకొన్నాడు. సరోజిని రాలేదు.

ముకుందరావుకి సంతోషం పొంగిపోతోంది. గోవిందు దగ్గరకు పోవాలి. అమ్మకు ఉత్తరం వ్రాయాలి. లోపల స్టవ్ మండుతోంది. ఎవరూ బయటకు రాలేదు. రెండు మూడు నిమిషాలు కూడా గడవకముందే ముకుందరావు రోడ్డుమీద తడుస్తూ నడుస్తున్నాడు.

తుమ్మపూడి కోటీశ్వరరావు | **జ్యోతిరన్వేషణ**

ఇదియేదో పెనువెల్గు – నిత్యమును నాహృద్వీథిలో వెల్గుచు
న్నది – నీలాలమొయిళ్ళ జిల్గుతెరలోనన్ మంజుకాంతిచ్ఛటా
స్పదమై మించు తళుక్కునన్ మెఱయుత్రోవన్ – దాని స్పందమ్ముతో
హృదయ మ్మొక్క ఝషప్రకంపితమృదుశ్రీపద్మమైపోయెడిన్.

వెలుఁగదియేమిటో ? కనులువిప్పక చూతునటన్న తానికన్
నిలుచున ?— అన్యకార్యపరినిష్ఠితచిత్తుఁడనైన వేళలో
వెలుఁగులుచిందిపోయునొక వేయిశరత్తుల పాలవెన్నెలల్
వలెఁ దనయిచ్చవచ్చినటు— వట్టితెరంబలెనుంటి నేనిటన్.

దళితప్రతిసుమచ్ఛదము వెన్క నే తల్లియో ! నిల్చి నవ్వినట్లుండు నేమి ! ?
మునిమాపువేళఁ జిక్కని ఎఱ్ఱమబ్బులోఁ బదములేవియో గుర్తువచ్చునేమి !?
రవిబింబమందు నెఱ్ఱని వెల్గదో తోచి "ననుజూడు"మని పిల్చి నవ్వునేమి !?
ప్రథితనిశీథినిన్ బయనించు నా వెంట మంజీరరవమేదొ మలయు నేమి !?
ఏమిటీ అనుభూతి ?— వచింపలేను గుండెలోనుండి దుఃఖమ్ము గొంతువఱకు
పొంగికొనివచ్చునేల ? ఏమూర్తికొరకొ అంగలార్చుచునున్న దీయాత్మ తాను.

అనవసరమ్ముగా హృదయమంతయు రాయిడి పొందునేల ? కా
రణమది భౌతికమ్ము కనరాదిక పెద్దవెలుంగదేదియో
మనసునకందరాక తనమవ్వపువెల్గుల రేకలో చివ
ళ్ళను గనుపింపజేయుచును లాగెడి ప్రాణములల్లలాడఁగా.

ఏమో వ్రాయుమటంచు జెప్పెదరు నా హృన్మధ్యమందెవ్వరో ?
ఆమూర్తింగనలేని నేనెటుల వ్రాయంజొత్తు ? ఏనాటికో
ఆమైచాయ తళత్తళల్ భ్రుకుటిమధ్యంబందునంజిందెనా
ప్రామిన్కుల్ వలె మంజులధ్వనులతోఁ బాటన్ గవిత్వాపగల్.

తరళమౌనది చిఱుతరగలందామూర్తి తలవెండ్రుకలను నొక్కులు దలంచి
కెరటాలపైఁ దూకు కెందమ్మినా తల్లి ముఖబింబసౌందర్యమును గ్రహించి
జలజలప్రవహించు సెలయేటి మ్రోతలో రతనాలయందెల రవళి వినుచు
నిద్దంపు ఎఱ్ఱగన్నేరు పూరేకులో దంతచ్ఛదారుణకాంతు లెంచి
రూపు గట్టని మహనీయ రుచిరమూర్తి చాయలిటు లీలగాపోల్చి సర్వసృష్టి
మూర్తి గట్టించుకోలేక ముకుళితాక్షి సంచలద్బాష్పముల విహ్వలించిపోదు.

దేవిమైథిలికై నాడు దేవులాడె నెల్లచోటులఁ గపిపరమేశ్వరుండు
నేడు నాతల్లికోసమే నేనుగూడ వెదకికొనుచుంటి సృష్టిలో విసుగులేక.

జె. వి. సుబ్బరాయుడు

# కథానిక - ఒక పరిశీలన

నవ్యసాహిత్యమున కథానిక సుస్థిరమైన ఉనికిని సంపాదించుకొన్నది. ఎన్నియో కారణములవలన కథానిక పాఠకులకు ప్రియతమమై యున్నది. ప్రాచీనగ్రంథముల బఠించుటకు దగిన యోర్పు లేక పోవుటయు, కథానికయందు నేటి సాంఘిక జీవితము ప్రతిబింబితమగుచుండుటయు దీనికి ముఖ్య కారణము. అందువలన కథానిక ప్రజాళిలో ప్రఖ్యాతిగాంచినదని చెప్పుటలో నతిశయోక్తి లేదు. నవలకు ప్రాథమికరూపము కథానికయే యనియు, కాలక్రమమున నవలను స్థానభ్రంశము గావించి కథానికయే ఆస్థలము నాక్రమించుకొనినదనియు కొందరందురు. ఇట్టి విషయములను పునరాలోచింపవలసి యున్నది.

కథానిక ఎన్నడును నవలాస్థానము నాక్రమింపజాలదు. నవలలో కలుగు "సద్యః పరనిర్వృతి" కథానికలో కలుగజాలదు. నవల మన హృదయముపై గలుగజేయు ప్రభావమును కథానిక కలుగజేయలేదు. జీవితము యొక్క వైవిధ్యమును సంశ్లిష్టతను కథానిక ప్రదర్శింపలేదు. దీనికి కారణము దాని వైశాల్యము కుదింపబడి యుండుటయే. అంతియే కాక పాత్రశీలమును గూడ స్థూలముగ జిత్రింపలేదేమో అనిపించును. 'అనాకెరినా' లోని లెవిన్ పాత్రయొక్క ఆధ్యాత్మికతనుగాని, 'రోమోలా' లోని టిటోమిలేమా నైతికపతనము గాని కథానికలో జిత్రింపలేము. చిత్రించినను నది కీళ్ళు సడలిన బొమ్మవలె కాన్పించును. నిత్యజీవితములో మనము వివిధరకముల మనస్తత్వములు, దృక్పథములుగల స్త్రీ పురుషులమధ్య నివసించుచు వారిని వివిధ సంబంధబాంధవ్యములలో, వివిధ పరిస్థితులలో జూచుచు వారిని కొంతకాలమునకు బూర్తిగ నర్థము చేసికొందుము. నవలలో ఇట్టి విశేషములే — మనము నిత్యజీవితములో, జూచిన అనుభవించనవానినే కాంతుము. కాని కథానికలోని పాత్రలతో మనకుగల పరిచయము చాల తక్కువ. వివిధ పరిస్థితులలో వానితో మనకుగల బాంధవ్య మస్థిరమైనది. కాని ఒక పాత్రమీద, ఒక ప్రత్యేకమైన దశలో మన ఆసక్తి, దృష్టి కేంద్రీకరింప బడవచ్చును; ఆ పాత్రమీద మనకు పాక్షికమైన ఒక గొప్ప అభిప్రాయము కలుగవచ్చును. కాని విశాలమై, సూక్ష్మాంశములనుగూడ వ్యక్తపరచురూపము మనలో కలిగించు చైతన్యము చితమై యుండును. కావున నవలలోని పాత్రలు ఎప్పుడును సంపూర్ణ అంగాంగిభావము కల్గి సజీవములై మన హృదయపీఠము వీడకుండ నుండవలయును. సాధారణముగ నట్టి పాత్రలే నవలకు భూషణములు. మానవజీవితములోని బహుముఖత్వముపై, సూక్ష్మాంశములపై మనకు శ్రద్ధయున్నంత వరకు నవల ఆధునిక సాహిత్యమందు పై విషయములకు ప్రాతినిధ్యము వహించు కళారూపముగ నిలచియుండును.

మన మిప్పుడు కథానికను గురించి మాత్రమే చర్చింపవలసి యున్నది అందువలన నవలకొక ప్రత్యర్థిగాగాని, ప్రత్యామ్నాయముగగాని దానిని గైకొనక నవలవలెనే ప్రఖ్యాతిగాంచి, సాహిత్యరంగమున ప్రముఖస్థానము వహించిన యొక గద్యకల్పికగనే భావించవలయును. అందువలన దాని రూపనిర్మాణమును గురించి విచారించుట సమంజసము.

కథానికనుగురించి "ఎడ్గార్ ఎలెన్‌పో" నిర్వచన మిట్లున్నది. "కథానిక యనగా చదువుటకు అర్ధగంటనుండి ఒకటి రెండుగంటలవరకు తీసికొనెడి యొక గద్య కథనము" అదే అభిప్రాయమును వేరొక విధముగ నిర్వచించిన కాలవ్యవధి యవసరములేక కొద్దికాలములో జదువదగిన కథనే కథానిక యని చెప్పవచ్చును. సంక్షిప్తత కథానిక యొక్క ముఖ్యలక్షణము కావున నది స్థూలరూపమునకు వచ్చుటకు సక్రమమైన అంగాంగ నిర్మాణముకూడ తోడ్పడవలయును. నవలకు సూక్ష్మరూపము కథానిక యనికాని, కొన్నివందల పుటలలో నతి శక్తిమంతముగ ప్రదర్శింపబడు విషయమును కొన్ని పుటలలో సంగ్రహపరుపబడినదని కాని ఎవరును తలంపరు. ఛార్లెస్ డికెన్స్ వ్రాసిన 'క్రిసమస్‌బుక్స్' నిర్మాణమున కథలయ్యును చిన్న నవలారూపములు. అంతమాత్రమున మన హృదయముల వికసింపజేసెడి వీనియందలి రచయిత కథాకథనకళను—ఒక పాత్రను సృష్టించి, ఆ పాత్ర శీలమును అంచెలవారిగ వివిధకథలలో తీర్చిదిద్దెడి రచనాశిల్పమును, (తెనుగున - ముని మాణిక్యం వారి 'కాంతం కథలు') నిరసించినట్లను కొనరాదు. ఒకప్పుడు సారూప్యములుగ నున్న కథానిక, నవలలు కాలక్రమమున తమతమ రూపములను తామే నిర్దేశించుకొనిన యాభరణములతో సర్వాంగశోభితముగ తీర్చిదిద్దుకొనుచు నేటికి పూర్తిగ విభిన్నములైనవి. ఇంతకు చెప్పునదేమనగా కథానిక నవలకు పూర్తిగా విభిన్నమైనది. కనుక దాని ఉద్దేశము, నిర్మాణము, కథనముగూడ ప్రత్యేకముగ నున్నవి.

కథానిక నిర్మాణమునకు మనకు కావలసిన పరికరములలో మొదటిదానిని సులభముగ సూత్రీకరింపవచ్చును. కథానిక వస్తువు శక్తిమంతముగ నుండి కథానిక పరిధులలో విస్తరించుటకు వీలుండవలయును. పాఠకునకు కథను జదివిన తర్వాత ఏర్పడు భావమే దీనికి గీటురాయి. కథావిషయమేదయినను, ఉద్దేశమేదయినను, ఎట్లున్నను - ఆ కథను కొంత పెంచి వ్రాసిన దానివలన ప్రకృతమున కెట్టి లాభము లేకపోగా అంగాంగ సౌష్ఠవము చెడునను భావము పాఠకునకు గలుగవలయును. దాని రూపము స్పష్టముగ మన హృదయములందు హత్తుకొనవలయును. ఎట్టి మార్పులకును స్థానములేక విషయసమ్మర్దము లేక తన పరిధిలో తాను ఒదిగి సంపూర్ణరూపముకలిగి యుండిన కథానిక మన హృదయముల మధింపజేయగలదు.

కథానికను వస్తువుగా ఒకే ఒక సన్నివేశమును గాని, ఒకే విషయమును గాని తీసికొనవలయునను నిర్బంధ ముండరాదు. ఒక సన్నివేశము కన్న నెక్కువే యుండవచ్చును. కాని ఆ సన్నివేశములతో రూపనిర్మాణము చేయునపుడు రచయిత కథాకథనశిల్పము కోటి దివిటీల కాంతియై రంజిల్లవలెను. ఒక పాత్రతత్త్వమున కొక భాగము గాని, ఆ పాత్ర యనుభవసహస్రమున నొకటి గాని, లేక మరి యే సందిగ్ధస్థితి కాని కథానికకు వస్తువు కావచ్చును; లేక ఎన్నో సన్నివేశములతో కథ విశాలమై దేశకాలములందు సంయోజనము లేకుండను ఉండవచ్చును. నవలలోని కథావైశాల్య మిందులోను ఉండవచ్చును. వాషింగ్‌టన్ ఇర్వింగ్ కథలలో (రిప్ వాన్ వింకిల్) నిట్టి విశేషమును మనము గమనింపగలము. జీవితగాథనంతయు రచయిత తన కథానికయందు జిత్రించినను, పాఠకుల కది విసువు గలిగింపదు. పైపెచ్చు అంత జీవితగాథను ఇంత చిన్న కథానికలో రచయిత ఎట్లు పొందిక పఱిచెనా యని మనకు సంభ్రమాశ్చర్యములు కలుగును. అట్లు చేయుటలో రచయిత తన ప్రధాన భావ వ్యక్తీకరణమున కడ్డువచ్చి పాత్రను వెనకకు నెట్టు సన్నివేశముల వేనిని గ్రహింపనొల్లడు. కొన్ని మపాసాకథలలోను (లాపరూన్) ఇట్లుండును. కొన్ని సంవత్సరముల కాలములో జరిగిన యొక విషాదగాథను అతడొకకథలో జిత్రించెను. అయినను రచయిత ఏ మూలబిందువుపై కథ

యాధారపడి యుండునో అట్టి మూలస్థానముపై తన దృష్టిని కేంద్రీకృతము గావించి ప్రధానకథకు సంబంధములేని యంశములను పూర్తిగ తొలగించి అద్భుతమైన కళాసౌందర్యమును, శిల్పచాతుర్యమును ప్రదర్శించెను. కావున ఎంత విశాలమైన కథావస్తువునైనను కథానిక పరిధులలో కుదించి కళావంతముగ జేయవచ్చును. ఇతర సాహిత్య శాఖలలో వలెనే కథానికలోఁగూడ వస్తువును ప్రతిభతో దీర్చిదిద్ది రూపకల్పన గావింపవలయును.

కథారచనకు గావలసిన రెండవ ప్రక్రియను గూర్చి మన మాలోచింపవలయును. అది అనుబంధ చతుష్టయమునందు ఏకత్వము. (ఉద్దేశము, ప్రయోజనము, క్రియ, భావము.) తరువాత కథానికలోని ఉపదేశకతలో నెన్నడును వైవిధ్య ముండరాదు. కథానికచేయు నా యుపదేశమును వస్తువుతో జోడించి అప్రత్యక్షముగ పాఠకుల హృదయముల జొచ్చునట్లు కావింపవలయును. ఈ ముఖ్యమైన ఏకత్వమే సంక్షిప్తముగ రూపొందింపబడిన కథనైనను, విశాలముగ రూపొందింపబడిన కథనైనను లేక యీ రెండు పద్ధతులకు మధ్యనున్న ఏ కథనైనను లక్షణీకరించును. నవలలో వివిధ విషయములు అంతరిక్షమున తారకలట్లు అల్లుకొని యున్నందున ఏది ప్రధానవిషయమో తెలిసికొనుట కష్టమగును. రాశివిశ్లేషమువలన ఒకటి రెండు అభిమాన కథావిషయములను వ్యక్తపఱుపవచ్చును. ఇట్టికథావిభిన్నత కథానికలో నుండరాదు ఇందులో మూల కథావస్తువు స్పష్టముగను, మనోరంజకముగనుండి, ఏపరిస్థితులలోను సందిగ్ధముగ నుండరాదు. ఉద్దేశము, ప్రయోజనము—వీని యందలి సంయోజనమే కథానికకు తలమానికము. అదియే కథానికకు నికషోపలము.

కథానికలో నీఏకత్వమును ఘటింపఁజేయుట రచయితకు కష్టతరమైన పనులలో నొకటి. నవలకంటె కథానిక మిక్కిలి కచ్చితమైన రూపమైనందువలన (రచయిత అందు ప్రదర్శించిన కళావైదగ్ధ్యము వలన) భావుకులైన పఠితకు రసాత్మకమైన పరనిర్వృతి కలుగుటచే దానిని పెక్కుడు విమర్శకులు నవలకన్న నున్నతస్థాయిలో నుంచిరి. "నిపుణుఁడయిన రచయిత సూక్ష్మాతిసూక్ష్మముగ వస్తువునూహించి తద్ద్వారా అద్వితీయమైన పరనిర్వృతిని గలిగించుటకు అవసరమైన సన్నివేశములను సృష్టిగావించి వానిని సన్నిహిత మొనర్చును. అటులగావించి తన ఆశయసిద్ధిని గాంచును తన రచనయందలి మొట్టమొదటి వాక్యమే అట్టి రససిద్ధిని గలిగింపని యెడల అతఁడు తనకార్యమునందు విఫలుఁడయ్యెననియే చెప్పవలెను. కథ పూర్తియగునంతవఱకు కథాంత మీవిధముగ నుండునను భావమెన్నఁడును పఠితకు కలుగరాదు. ఆవిధముగనుండి చాల జాగరూకత వహించి శిల్ప నైపుణ్యమున చిత్రించిన సర్వాంగ సుందరమైన రూపముగ నుండవలయును. ఆ రూపము సహృదయుల హృదయపీఠములపై నాట్యము సేయుచు వారికి ఆనందాశ్చర్యముల గలిగింపవలయును. ఉద్దేశమున నేకత్వముగల్గి నిశ్చలమై యున్నందున ఆ ఉద్దేశమును అలంకారముల యవసరములేకయే వ్యక్తపఱుపవచ్చును. ఇట్టిదానిని మనము నవలలో పొందజాలము." కథానికకు సంపూర్ణత్వము నాపాదింపజేయుటకు పైజెప్పిన 'పో' అభిప్రాయములు సహకారులుగ నుండును. కథానికలోని భావోత్కృష్టతను వెలిబుచ్చునవి కనుక పై అభిప్రాయములను మనస్సున నుంచుకొనవలెను. కథానిక రచనకు సంక్షిప్తత, కేంద్రీకృత దృష్టి యవసరముగను కథానికరచనకుఁబూనుకొనుటకు ముందుగా అంగాంగక్రమ నిర్మాణమునందు ప్రత్యేకమైన శ్రద్ధ తీసికొనవలెను. అనావశ్యకమైన విషయములను బరిహరించి, యుక్తమై యోగ్యమైన విషయముల చిత్రణ గావించి, కీలకస్థానముల సక్రమముగ రూపొందించి, ఆయా సన్నివేశములకు దగినట్లు వానికి విలువలను బొందింపజేసి—కథతో నెట్టి సంబంధ బాంధవ్యములులేని యంశము

లను బరిత్యజింప వలయును. సాంకేతికమైన లోపములను అతిసూక్ష్మముగ బరిశీలించి పరిష్కరింపవలయును. ఎప్పుడును రచనాశిల్పము వస్తువు, ప్రయోజనములపై ఆధారపడియుండును. కథానికలో క్వాచిత్కముగనైన సంభాషణ లుండవచ్చును; లేకనుపోవచ్చును; లేక పూర్తిగా సంభాషణతే యుండవచ్చును. కాని సాధ్యమైనంతవఱకు వర్ణనలు మితముగ నుండవలయును. కొన్నియెడల కథాగమనమునకు దోహద మొనగుచున్న వర్ణనల గావించుట సమర్థనీయము. స్థూలమైన, స్పష్టమైన రూపముయొక్క అంగాంగ సౌష్ఠవము చెడకుండునట్లుగ ప్రాసంగిక విషయముల నెంతవఱకు పెంచిన లేక కుదించిన బాగుండునో రచయిత గమనించుకొనవలెను.

ఇక మూలభావమును గుఱించి యోచించునపుడు అది సామాన్య సత్యముల నెన్నడును ప్రపంచింప బూనుకొనరాదు ప్రధాన సూత్రములను మనస్సున నుంచుకొని కథానిక రచన సాగించునపుడు భావవస్తువు తెట్టిదైనను, ఎంత విస్తృతముగ నున్నను, ఆదరణీయములే. ఒక నాటకీయమైన సన్నివేశము; ఒక సంభాషణ దృశ్యము, విభిన్న సన్నివేశముల కలయిక, శీలములోని ఒక భాగము, అనుభవ శతములో నొకటి. ఒక నైతిక సమస్య - ఇవియే కాక మఱియేదైనను కథకు మూలబిందువుగా నుండవచ్చును.

"కథారచనకు నాకు తెలిసినంతవఱకు మూడే మార్గము లున్నవి. 1. కథారూపమును మనస్సున నుంచుకొని అందుకు తగినట్లుపాత్రలను నిర్ణయించుకొనుట, 2. ఒక పాత్ర శీలమును గ్రహించి దానిని చిత్రించుటకు తగిన సన్నివేశముల సమకూర్చుకొనుట. 3. లేక ఒక ప్రత్యేకమైన వాతావరణమును సృష్టించుటకు- అనువగు పాత్రలను, శిల్పమును గ్రహించుట. సముద్రతీరమున నిలువబడిన నాలో ఆసముద్రము కలిగించిన అనుభూతులను వెలిబుచ్చుటకు నేను ఒక కథ వ్రాయవలసి వచ్చినది" అని కథానికను గుఱించి స్టీవెన్‌సన్ తన ఉద్దేశములను వెలువరించినాడు. ఈవిధముగ విభజించుట అంతిమ నిర్ణయము కాకపోయినను దీనివలన మనము కొన్ని కథామర్మములను తెలిసికొనవచ్చును.

—(హడ్సన్ ఆధారముగా)

వి. శశి

# వీథి దీపం

కాంతారావు అగ్గిపుల్ల ముట్టించి, చీకటిని తరిమి, దాని కచభారంలో వీథి దీపం తురిమి, నిచ్చెనమెట్లు దిగి క్రింద అడుగుపెట్టాడు. వర్షం కురిసి వెలిసినందువల్ల నేలంతా తడిగావుంది. ఎత్తుపల్లాలబాట బ్రతుకుబాటలాగ ప్రాకుతోంది ముందుకు. బ్రతుకుబాట మధ్య పేరుకొనే చీకటిలాగే, బాట మధ్య నీరు చేరుకుంది. ఆ నీటిపై దీపకాంతి పడి, మెత్తగా చుంబించి మరోచోటుకు ప్రయాణంచేసి ఆకులపైబడి మెరుస్తుంటే కాంతారావు కదోలా అనిపించింది మనసులో.

వెలుగుచీకట్ల జమిలి దుప్పటికి అంచు ఆ రోడ్డు. ప్రక్కనున్న వృక్షాలూ, డొంకలూ లతలు. ఈభావం కాంతారావుకు కలగగానే నవ్వొచ్చింది. చిన్నగా నవ్వుకున్నాడు. సిగరెట్ల కోసం జేబులు తడుముకున్నాడు. దొరికినవికావు. జేబులు నిండిన శూన్యంలో మహారాజులా అగ్గిపెట్టె గలగలలు. మళ్లా నవ్వుకున్నాడు కాంతారావు.

ఈ రోజంతా అతనికి నవ్వుగానే వుంది. వర్షం రావటం, ఆకాశంలోని మేఘాలు బరువును క్రిందికి రాల్చి తేలికగా పరుగెత్తటం, చీకటిపడేవరకూ యీ పాడుదీపం వెలిగించ తలపెన పని లేకపోవటం— యీ రోజంతా కాంతారావు ముఖంపై ఆనందవర్షం వర్షిస్తోనేవుంది.

ఈ వూరువచ్చి కాంతారావు కొన్నివందలసార్లయినా ఆ దీపం వెలిగించాడు. కాని, అది ఒకరాత్రివేళకెక్కడికో ప్రయాణంచెయ్యటం, తెల్లవారేసరికి చమురు కాస్తా త్రాగి మత్తుగా కన్నుమూయటం జరుగుతోంది. కాంతారావు ఆ దీపం తుడుస్తూ 'వింతదీపం' అనుకుంటూ కాలంగడిపాడు. నేటికీ వింతదీపం అనుకుంటూనేఉన్నాడు.

ఇవాళ దీపం వెలిగించి కాలు క్రిందమోపగానే కాంతారావు కొక ఆలోచన కలిగింది. కొద్దిగా ఆగి ఆ దీపం ఎలాగ నడుస్తుందో చూడాలనిపించింది. దూరంగావెళ్లి సిద్ర గన్నేరు చెట్టు చాటుగా నిలబడి దీపంపైపే చూస్తూఉన్నాడు. వీథిదీపం చీకటితో పోరాటం చేస్తూనేవుంది.

ఇంటికి వెళ్లే ప్రయత్నంలో రెండడుగులు ముందుకు వేశాడు.

చలి— మళ్లా ముందుకు రెండడుగులు, నీడలు దూరంగా పరుగెడుతున్నాయి.

చాయల చేతులతో భూదేవి చెక్కిళ్ల నెవరో నిమురుతున్నట్టుంది. వెనక్కి పరుగెడుతున్న తేజోమూర్తిని గాఢాంధకారం పరివేష్టించి పట్టుకోవాలని ప్రయత్నం చేస్తున్నట్టుంది.

కాంతారావు ఆగాడు, వెనక్కి తిరిగాడు, ఆశ్చర్యంగా చూశాడు. దీపం అత్యాశ్చర్యంగా నడుస్తోంది. కళ్లు నలుపుకున్నాడు. వళ్లు ముట్టుకున్నాడు. చూశాడు. దీపం నడుస్తోంది. వళ్లంతా చెమట్లు గ్రమ్మాయి.

కాంతారావు ముందుకీ, వెనక్కీకూడా నడవలేకపోయాడు కాంతారావు ఆలోచనల ఆవరణలో ఒక దెయ్యం, ఆ దెయ్యం కోసం మరొక దెయ్యం దీపం కొనిపోవటం, దెయ్యాల వికృతాకారాలూ, వక్రగతులూ కదిలాయి భయంతో కళ్ళు మూసుకుని, నిచ్చెన భుజాన భారంగా తగిలించుకుని వెళ్లి, దామోదరంగారి గోడకు ఢీకొన్నాడు, భయంలో దెబ్బ మాట మరచి పెద్ద పెద్ద అంగలేసుకుంటూ వెళ్లిపోయాడు.

## 2

కాంతారావు రెండురోజుల నుండీ జ్వరభారంతో కుంగిపోతున్నాడు, ఊరుకాని వూళ్లో నా అనేవాళ్ళు లేనిచోట జ్వరపడ్డాడు పాపం! కాంతారావును పెద్ద దయ్యమేదో పట్టుకుందిట వీధిదీపం దెయ్యమై తిరుగుతున్నదనే వార్త కొద్దో గొప్పో వూరివాళ్ల నోట పడి నలిగిపోయినా కాంతారావు కీ విషయం చూచేవరకూ తెలియదు నిజమని.

రెండు రోజుల నుండి వీధిదీపాలు వెలిగించటానికి వెళ్లకపోయేసరికి ఉదయం పదిఅయ్యేసరికి వెంకటేశం వచ్చాడు యముడిలా.

"ఏమందోయ్! కాంతారావు లేడూ?"

"ఎవరూ?" అని ప్రశ్నించింది రాధ. రాధ కాంతారావు అద్దెకుంటున్న యింటివాళ్ల పిల్ల. ఎంతోమంచిది. కాంతారావు కనేక విధాల సహాయం చేస్తుంది. అప్పుడప్పుడూ బాల్య చాపల్యం వల్ల పెంకితనం కనబడినా, ఎంత కంటే మేలు.

"కలెక్టర్‌గారని చెప్పు" అన్నాడు వెంకటేశం.

"ఏ కలెకరూ?" "ఏ కలెక్టరేమిటి నా తలకాయి!! కలెక్టరంటే కలెక్టరే. అడదంటే, ఆడదేగాని మా వలె మగ పురుషుడు కాలేదుకదా?"

"ఆ విషయాలు తమరిక్కడ వర్ణించ నక్కరలేదు. చెబుతానుండండి" అంటూ చిరాగ్గా వెళ్ళిపోయింది తలుపు చాటునుండి.

కాంతారావు, రాధ వస్తున్నట్లు గుర్తించి గ్లూకోజు వాటరు కావాలని గోల ప్రారంభించాడు. మూడుగు మోతాదు పెరిగితేనేగాని, పరిచర్య ముట్టవలిసినంతగా ముట్టదని అతని భయం.

రాధ ఆ గదిలో ప్రవేశించాక "చూశారూ? చస్తున్నాను. ఒక్క చంచెడు గ్లూకోజు కలిపి తగలేద్దురూ నా మొహాన" అన్నాడు.

"మీరు డబ్బులివ్వలేదు. అన్నయ్య తేలేదు."

"అరి! రేవలేక చస్తున్నానుగాప, లేకుంటే పెట్టితెరిచి మీ డబ్బు మీ మొహాన పడెయ్యనా? ఒక్క ఆరు నయాపైసాలు సహాయం చెయ్యలేరూ ఒక మానవుడికి? అద వాళ్ళలో పుణ్యమిలాగ చచ్చిందికాబట్టే చచ్చేవంకూ వాళ్ళకు పెళ్ళిల్లుకాకండాపోతున్నాయి."

"ఎప్పుడు చూచినా మీ నోట పెళ్ళి శబ్దమే!"

"అంతకంటె శుభకార్యం మరొకటి లేదుకదండి తలుచుకుని ఆనందించడానికి?"

"అయితే ఎవర్తనో కట్టుకోరాదూ?"

"అంతఅందంగా,.....మీవలె పరిచర్యలు చేసేవాళ్ళు దొరకాలిగాని అయినా, పాడుపెళ్ళి కేమివచ్చిందిలెండి. దయచేసి గ్లూకోజు...."అని వస్తున్న వెకిలినవ్వును ఆపుకున్నాడు కాంతారావు.

అంత జ్వరంలోనూ కాంతారావు వెకిలినవ్వును చూస్తే రాధకు కోపం వచ్చింది. అతను జ్వరం లేకపోయినా కుహనానటనలతో కాలంగడుపుతున్నాడని రాధఅనుమానం

"సరే! మీ కోస మెవరో వచ్చారు" అని చెప్పింది రాధ నవ్వుతూ, లోతుగా దిగిపోయి జాలిగా చూస్తున్న అతని కళ్ళవైపు చూస్తూ. ఆ కన్నుల్లోకి చూస్తుంటే రాధ మనసులో సిగ్గులు చిగిర్చాయి. అటే చూడలేకపోయింది.

"ఎచ్చాడూ? వస్తాడు. రాకేమిచేస్తాడు? వాడికోసమేగా నేనింత దిగులుపడి చస్తుంట. చూశారా?"

"ఏమిటి?"

"వస్తాడన్నాను. వచ్చేశాడు. ఇప్పుడు చిరచిరలాడండి మీ యింటి అద్దె యివ్వలేదని?" అన్నాడు కాంతారావు ధీమాగా.

"ఎవరొచ్చారనుకున్నారు?" అని అడిగింది రాధ.

"ఇంకెవరు? నా పాలిటి కామధేనువు. నా పాలిటి కల్పతరువు. నా పాలిటి వజ్రాయుధం. వాడు మా వేలు విడిచిన మేనమామ కూతురి మొగుడి తమ్ముడి మేనమామ. నాకు వాళ్ల పిల్ల నిచ్చి పెళ్ళిచెయ్యాలని ఏడి చస్తున్నాడు. వాడు చిలక్కొయ్యకు తగిలించిన షర్టుజేబులో చూపుతానుగా కట్టలు" అని అక్కడితో ఆగాడు.

రాధ మాటలు వింటో నవ్వుతోంది. ఆ నవ్వు కాంతారావును అపహాస్యంచేస్తున్నట్లు గుర్తించాడు కాంతారావు.

"అస లెవరొచ్చారో చెప్పండి, చంపక" అన్నాడు మరల బాధతో. అతని నిండా జ్వరం. మెదడు దహించుకుపోతుంది. దాహం, గుండె నిండా భయం. రాధ కాంతారావు నా పరిస్థితుల్లో అపహాస్యంపాలు చేస్తున్నందు కతనికి కోపం వచ్చింది.

"వాడెవడో అప్పులవాడుట!" అని నాలుక కరుచుకున్నది రాధ. రాధకు కాంతారావులో బాధా, కోపమూ స్ఫురించాయి. దానితో కొద్దిగా పరిహాసం బిగువు సడలించకుండా మాట్లాడినందుకు ఆమెపై తనకే కోపంవచ్చింది.

"పరిహాసం గాని, నాకోసం వచ్చే అప్పుల వాడెవడండీ! యీ భూప్రపంచంబున? కంఠశోష వచ్చేస్తున్నది, మాట్లాడలేపిక. ఒక్క అణా గ్లూకోజు ఇప్పింతురూ" అని ప్రాదేయపడి అడిగాడు రాధను.

రాధకు, కాంతారావు జ్వరం రోజురోజుకూ పెరుగుతున్నా అతని ప్రవర్తనలో మార్పురాని గురించి కోపంగావుంది.

మారనిరూపాయి విలువమారనట్టు కాంతారావు జీవితంలో నేటివరకూ వెలితి కనబడలేదు రాధకు. బంధువులకు దూరంగా, భుక్తికే చాలీచాలని జీతంతో బ్రతుకుతున్నా నిత్యం ఆనందంగావు టాడు. రాధ స్వగ్రామంలో,స్వగృహంలోనేవుంటున్నా నిత్యం దిగులుగానేవుంటుంది. ఆ దిగులుకు కారణం తెలియదు ఆమెకు కూడా. ఎందుకో కాంతారావును చూస్తే యీర్ష్య

వెలుపలున్న వెంకటేశం చెవిలో సూదులు గుచ్చినట్లు "వచ్చినవారు బిల్లు కలెక్టరులు!" అంటూ వెళ్లిపోయింది. స్విచ్ నొక్కితే వెలిగే మెర్క్యురి లైటువలె ఆమె పెదవుల అరుణిమపై నవ్వువెలిగింది. రాధ వెళ్లిపోతుంటే విపత్తులో భగవంతుపిమ్మందు మోకరిల్లిన భక్తుపలా ఆమెవైపు చూస్తూ ఉండిపోయాడు కాంతారావు.

వెంకటేశానికి రాధ విసిరిన అక్షరతూణీరా లోక లెఖ్క లోనివికాదు. లేతగా నవ్వుతూ లోన ప్రవేశించాడు. లోనకు వెళ్లి కాంతారావును చూడగానే ఆశ్చర్యపోయాడు. రెండు రోజుల క్రితం. విచ్చెన భుజాన తగిలించుకొని దుక్కలాగ తిరిగినవా డిలాగ శల్యావశిష్టంగా మిగులుతాడని ఎవరను కుంటారు? రెండురోజుల్లో....ఎంత మార్పు!!

వెంకటేశం, కాంతారావు ప్రక్కనే కూర్చుని నుదురు తడిమి చూశాడు. వెచ్చగావుంది. ఖిలాయ్ ఉక్కుఫర్నెసులో పెట్టినట్టుంది చెయ్యి. "ఇలాగైపోయావేమిటి?" అని ప్రశ్నించాడు వెంకటేశం. "జ్వరం" అని సమాధానం ఇచ్చాడు కాంతారావు. "తెలుస్తూనేవుంది. ఒక్క రెండు రోజుల్లో యిలాగ పెరిగిపోయిందేమిటి నీ టెంపరేచర్? అనడుగుతున్నాను. ఆ రాత్రి ఎక్కడికైనా వెళ్లావా?"

"ఎందుకు?" అని ఆతృతకంఠంనుండి వెలుపలకు విసిరాడు. అతని అనుమానం మరింత దృఢపడింది.

"ఎందుకైతేనేమిలే? గాలీధూళీ అంటకుండా తగిన కట్టుదిట్టం చెయ్యించాలని" అన్నాడు వెంకటేశం.

"వెళ్లాను."

"అయితే అనుకొన్నంతపని జరిగింది. అడగాలిమాత్రం సోకలేదుకదా?"

కాంతారావుకు పైమాట అర్థంకాలేదు. మరొకప్పుడైతే గొప్పగా అర్థంచేసికొని, దానిపై మరొకగంట ఉపన్యాసం దంచేవాడే. అతని బుర్ర యాత్వరీజియాలాగ పనిచేసేదే. కాని, అతని మనసులో నడుస్తోన్న దీపం నేను పరుగెడుతోంది. కాంతారావు మనోమైదానంలో వీధిదీపాలు దెయ్యాలై పరుగెడుతున్నాయి.

కాంతారావు మనసు స్వాధీనంతప్పింది.

"వీధిదీపం వింతభూతం"—అని రాగాలుప్రారంభించాడు. వెంకటేశం ఆశ్చర్యపోయాడు. అతని గుండెలో నయాగరాలు. అతని మెదడులో అగ్నిపర్వతాలు. దెయ్యంపక్కనే కూర్చుని, దెయ్యంతో సంభాషించాడింతకాలం. మంచంపైనుండి లేచాడు. "నన్ను మూడురోజులుభయపెట్టి మూడు చెరువుల నీరు త్రాగించింది. చచ్చాం!" అంటూనే యింటినుండి ఒక్క పరుగుతో వీధిముఖం చూశాడు. రాధ పిలిచినా వినిపించుకోలేదు వెంకటేశం.

"కలెక్టరుగారికీ భయమేనా?" అని సాగదీస్తూ, నవ్వులు పిలికళ్ళనుండి లోకంముహంపై చిమ్ముతూవచ్చింది రాధ గదిలోనికి.

కాంతారావు రాగం రిషభంలోనికి మార్చి ఆలపిస్తూనే ఉన్నాడు. రాధకు దెయ్యంపేరు చెవులపడగానే గుండెలో రైలుబళ్లు పరుగెత్తేవే. కాని, ఆ మాటలు కాంతారావు నోటిమీదుగా రావటమే ఆ మాత్రం ధైర్యానికి కారణం. ఇదంతా గ్లూకోజుకోసం కాంతారావు పన్నినపన్నుగడగా భావించింది. కనీసం వేడినీళ్ళు కూడా వెంటనే యివ్వకూడదనుకుంది. కాని; ఆ శుష్కశరీరం, ఎంతో ఉత్సాహంగా నోటినుండి వచ్చే పలుకులు పెదవులవెనకే ఆగిపోవటం రాధకెంతో జాలిని కలిగించాయి. వేడినీళ్ళుమాత్రం తెచ్చి మంచందగ్గిర పెట్టి వెళ్ళిపోయింది రాధ.

## 3

అటు కొబ్బరిచెట్ల వెనకనుండి సూర్యుడు గుంకిపోతూ తన ఎర్రని పాదాలను వెనక్కి లాక్కుని, చీకటితో కాళ్లు కడుక్కుని దినమంతా చేసిన ప్రయాణంలో అంటుకున్న ధూళిని లేకుండా చేసుకున్నాడు. రెండురోజులుగాపడుతున్న వాన యివాళ కూడా వచ్చింది. గాలి మేఘాలను తరుముతున్నకొద్దీ వర్షం మామూలుస్థాయి దాటింది. దూరంగా నీటిదొరువుల్లో కూర్చుని పుటకతో నేర్చుకున్న పాడుమంత్రాలు చర్వితచర్వణంగా వినిపిస్తూన్నాయి కప్పలు.

లోకం మొహంపై చీకటితెర వాలినా యింటికి జేరుకోని అన్నగారి గురించి ఆలోచిస్తూ కూర్చున్నది రాధ. కాంతారావు గురించి జాలిగావుంది. అతనిలో పెద్దమార్పువచ్చింది. జ్వరం బాగా ఆవహించింది. దానికి తోడు కలవాట్లు. రెండు రోజుల్లో మనిషి చీపురుపుల్లలా అయిపోయాడు. గ్లూకోజు కోసం వెర్రాలనిపించింది మనసులో. ఈ చీకటి నెలాగ? భయం. దీపం దయ్యమైపోయిందని కాంతారావు గోలచేస్తున్నాడు. మరిన్ని వేడినీళ్ళు కాంతారావు మంచందగ్గిర పెట్టింది.

"ఏమండీ! మంచినీళ్ళు త్రాగుతారా?" అని అడిగింది.

కాంతారావు స్వప్నజాగ్రదవస్థల మధ్య తేలుతున్నాడు. కాంతారావు మాట్లాడలేక ఆమెవైపు చూశాడు జాలిగా. ఆ చూపులు రాధ మనసును కరిగించాయి. ఆ జాలిని మనసులోనే మూతపెట్టి మాటలరూపం ధరించకుండా చేసి, వెళ్ళి వీధి అరుగుపై కూర్చున్నది.

చీకటిలో యింటి చూరునుండి వాననీరు దబదబా రాలుతోంది. చల్లగా వీస్తున్న గాలి చెట్లచెవుల్లో విషాదగీతాలు పాడుతోంది.

రాధ హృదయంలో కాంతారావు, అతనిపరిస్థితులు ఆమె మనసులో రంపపుకోత ప్రారంభించాయి.






పాపం! అతనిదేవూరో! అతని తల్లి యీ వానలో, చలిలో ఎలాగుంటుందో మరొకచోట? కొడుకును గురించి ఎలాంటి కలలు కంటుందో! ఆమె కి ఆలోచనలన్నీ మనసులో మెలగుతున్నాయి. హృదయం బరువెక్కిపోయింది. దిగులుగా దిగజారిపోయి, గోడకానుకుని, చీకటిని చీల్చుకొని వానజల్లుపై పడుతున్న చిన్న దీపకాంతిని చూస్తూ కూర్చున్నది రాధ.

రాధ అన్నగారైన శ్రీహరి వానలో తడుస్తూవచ్చారు. అతని షర్టు, పైజామా శరీరాని కంటుకుపోయాయి తడిచి. జుట్టు తడిచి నుదుటిపై బరువుగా వేళ్లాడింది.

"అన్నాయ్! ఇంత ఆలస్యం అయ్యిందేమిటి?" అని అడిగింది రాధ.

"వెధవ పని ముగిసిందికాదు. పనిముగిసే సరికి వాన తయారయ్యింది. నేను ఆగినా, వాన ఆగేటట్టులేదు. చేసేది లేక తడుస్తూ వచ్చాను."

"తలంటుకోటానికి కుంకుళ్లు కొట్టేదా?"

"నబ్బుందిగా!"

"కాంతారావుగారు కలవాట్లు పలుకుతున్నా రన్నాయ్!"

"ఏమని?"

"ఏదో దెయ్యమట. దీపందెయ్యమై అతని తల చుట్టూ గిరికీలు కొడుతుందట. ఏదో పాటకూడా పాడుతున్నారు." అని చెప్పింది రాధ. ఆమెహృదయంలో భయం, భయంతో జాలీ ముప్పిరిగొంటున్నాయి.

శ్రీహరికి నవ్వూ, కోపమూ కలిగాయి. ఆ కోపంలో ఒక రకమైన ఆనందం కూడా కలిగింది. కాంతారావు విషయమే విచిత్రంగాతోస్తుంది శ్రీహరికి. అతని ప్రవర్తనే మరీ విపరీతం.

ఈవూరు కాంతారావు వచ్చి రెండు సంవత్సరాలు గతించాయి. ఈ రెండు సంవత్సరాల్లోను నాలుగు సార్లు తన స్వగ్రామం వెళ్ళారు. తన స్వగ్రామంలో పెద్దగా ధనం వుందట. వాళ్ళ కుటుంబంతో పడక వచ్చేశాడట. ఇవన్నీ అతను చెప్పినమాటలు, అసలతని దే వూరోకూడా సరిగా తెలియదు నేటికీ. అతనికిచ్చే 3500 నయాపైసాల జీతంలోనూ భోజనం ఖర్చులు నెలకాగానే యిచ్చేస్తాడు శ్రీహరి చేతికి. గది అద్దెమాత్రం నేటికీ ఒక్క నయాపైసా అయినా చెల్లించలేదు. అదే కాంతారావుపై గల కోపం శ్రీహరికి.

పొడిబట్టలు మార్చుకొని, తడిబట్టలు రాధ చేతికిచ్చి కాంతారావు గదిలోనికి వెళ్లాడు శ్రీహరి. కాంతారావు మంచంపై పడుకుని పాటపాడుతున్నాడు కలవాట్లలో-

"వీధి దీపం, వింత భూతం"

కాంతారావు మంచం దగ్గిరికి వెళ్లి పిలిచాడు శ్రీహరి. కాంతారావు మాట్లాడలేదు. అతని ఆలోచనలో అతనే లీనమైపోయాడు. అతని పాట పాటకు మధ్య ఉన్మాదిలా కేకలు కూడాను. శ్రీహరి కొద్దీ కోపం పెరిగింది. అతనికి అద్దె సంగతి జ్ఞాపకం వస్తేనే చాలు కోపంవచ్చేస్తుంది. ఎంతకాలం! రెండు సంవత్సరాలు గడిచిపోయాయి.

దగ్గరికి వెళ్లి గోలచెయ్యకు అన్నట్టు తాకాడు. బిలాయ్ ఉక్కు ఫర్నేసులాగుంది అతని శరీరం. శ్రీహరి ఆశ్చర్యపడ్డాడు. అంతవరకూ తా నా రకంగా ఊహించినందుకు తనపై తనకే చిరాకుకలిగింది. కాంతారావు యింట్లోని దీపం కాస్తా రక్తంవంటి కిరసనాయిలు త్రాగి నిద్రపోయింది. ఆ దీపం వెలిగించినట్టు కాంతారావుకు తెలియదు కాని, తెలిస్తే దాన్ని చూచి ఎంత భయపడేవాడో! మరొక దీపం తీసుకు రమ్మని పిలిచాడు, చెల్లెలిని శ్రీహరి.

"నీకు భోజనం వడ్డిస్తున్నా నెలాగు?" అని అడిగింది రాధ.

"అప్పుడే వడ్డించకు భోజనం, గ్లూకోజు కోసం వెళ్ళాలి" అంటూ అరుగుపై నున్న తాటాకు గొడుగు తీసుకుని వెళ్లిపోయాడు.

ప్రక్క గదిలో రోగి చల్లని వానరాత్రి భూతాలనీ, దెయ్యాలనీ గోలచేస్తుంటే రాధకు భయంగా వుంది. వంటరిపాటు మరీ భీతిని పురిగొల్పుతోంది. వంటగదిలో నుండి వీధిలోనికి వీధిలో నుండి వంట గదిలోనికి తిరిగింది భయంతో. చివరికి అన్నగారి గదిలోనికి వెళ్లి పుస్తకం ఒకటి ముందుంచుకుని కూర్చుంది. రాధకు అక్షరాలు సరిగా కనబడటంలేదు. అటక మీది నుండీ, వెనక నుండీ భూతాలు వస్తున్నట్టు భయంగావుంది. నీడలు భయాన్ని నూరిపోస్తున్నాయి. ఆ భయంలో గట్టిగా కళ్ళు మూసుకొని, దేవుడ్ని హృదయం నుండి నోట్లోనికి తెచ్చుకొని, ఆ నామం పంచదార బిళ్ల మోస్తరుగా చప్పరిస్తూ కూర్చుంది.

## 4

"ఎక్కడికి వెళుతున్నావు?" అని ప్రశ్నించాడు దారిలో వెంకటేశం శ్రీహరిని.

"గ్లూకోజుకు. మరి నువ్వు?"

"ఇదిగో విచ్చేన. మనవాడు మరణశయ్యపై పడ్డాడు. ఇహ నేనే తరువాయి. ఈ వెధవ పంచాయితీ బోర్డు పని మాని చక్కాపోతాను. దెయ్యాలతో దేవుళ్లాడైపోయింది."

"అయితే ప్రెసిడెంటూ, మెంబర్లూ మీ పాలిట దెయ్యా లయ్యారా ?"

"బ్రతికున్న వీళ్ళెక్కడ్లేనా! చచ్చిన ప్రెసిడెంటు పాంభుడుగాకులేడూ ?"

"అవును "

"ఈ దీపాలు వెయ్యించింది ఆ దెయ్యమే కదటయ్యా! దెయ్యాల్ని తగిలించాడు"

"తరవాత మాట్లాడదాం."

"కొంచం ఆగు శ్రీహరీ !"

"నాకు తీరిక లేదు."

"వెధవ నాలుగు రోడ్లు కలిసినచోట తగులడింది దీపం. ఈ వానలో వెలిగించకపోతే బళ్ళు తల్లక్రిందులై మనుషులు అపదలపాలై పోతారట! చూశావ్! అసలు విషయ మొక టున్నది."

"నన్ను విసిగించక చెప్పు."

"వాన యిలాగ కురుస్తుంటే నాకు మాత్రం సరదా అను కుంటున్నావా ? నిన్న దీపం వెలిగించలేదు. నానాచివాట్లూ వేశాడు. ఇదిగో, ప్రాణం గుప్పిటపట్టుకుని వచ్చా నీవేళ. నమ్ము. నమ్మకపో. ఈ దీపం దయ్యమై మన కాంతారావును పట్టుకుంది. అదే వాడి రోగానికి కారణం, శాస్త్రి చెయ్యిం చాలి." అన్నాడు వెంకటేశం.

శ్రీహరి చిన్నగా నవ్వుకుంటూ ముందుకు వెళ్ళిపోయాడు. చీకటిలో గొడుగు బుజాన వేసికొని వెళుతున్న శ్రీహరిని చూస్తుంటే వెంకటేశానికి భయం కలిగింది.

వెంకటేశం గుండెనిబ్బరం చేసికొని వెళ్ళి లైటువేపు చూశాడు. చీకటి. నిచ్చెన దాని కానించి లైటు వెలిగించాడు. గాలికి ఆరిపోయింది. భయంతో వణికిపోయాడు. తిరిగి వెలిగించి, గబగబా మెట్లు దిగబోయాడు. క్రిందమెట్టు దగ్గిర కాలు జారింది. నిచ్చెన భుజాన తగిలించుకొని, మందర పర్వతమంత గొడుగూ మోస్తూ, చేతిలో లైటు వూయించు కుంటూ గబగబా ముందుకు నడిచాడు. రెండు మూడు పర్లాం గులు వెళ్ళి వెనక్కి తిరిగిచూశాడు.

వీధులు పరుగెడుతున్నాయ్.

వీధల్లో వింతవింత క్రీడలు కనబడుతున్నాయ్!

దీపం కదుల్తోంది. వళ్లు దులుపుకున్నాడు. కళ్ళు నలుపు కున్నాడు. దీపంనడుస్తోంది. నమ్మడానికి శక్యంగాని నిజాన్ని అబద్ధంకంటె ఆశ్చర్యకరమైన నిజాన్ని మరోసారిచూశాడు.

వీధిదీపం— వెంకటేశం వెలిగించిన వీధిదీపం తిన్నగా కాంతారావు యింట్లోకి వెళ్లింది గాలిలో తేలుతూ.

# 5

వెంకటేశం రైలుబండిలా రొప్పుతూ వచ్చి శ్రీహరి యింటిముందు వాలాడు.

"శ్రీహరీ! శ్రీహరీ!!" అని పిలిచాడు.

"కిలక్టరుగారొస్తే తలుపు తెరిచేదిలేదు" అని హేళనగా నవ్వింది రాధ.

"కొంచం తియ్యండి. వాలుగాలి వానలో తడిచిపోతు న్నాను" అన్నాడు ఆతృతగా, భయంతో.

శ్రీహరి తలుపుతెరిచి "ఏమిటి సంగతి ?" అని ప్రశ్నిం చాడు.

"ఏమున్నది! ముందు అరుగుపై కూర్చో."

శ్రీహరీ, వెంకటేశం అరుగుపై కూర్చున్నారు. వాన గాలితోకూడి గోలచేస్తూంది. వెంకటేశం శ్రీహరికి దగ్గరిగా జరిగి—

"ఆ దెయ్యం! ఆ దీపదెయ్యం చెట్టంత పెరుగేసుకుని, గాలిలో తేలుతూవచ్చి, మీ యింట్లో వెలగపండంతరూపాన ప్రవేశించింది. మన కాంతారావు పని గల్లంతే. వెంటనే శాస్త్రి చెయ్యించకపోతే మనల్నికూడా మింగగలదు. అసలా దీపాన్ని పాత ప్రసిడెంటు ఆవహించాడు. రెండుమూడుసార్లు నాకు కలలో కనబడి 'ఆ దీపం సరిగా తుడువుసుమీ!' అని హెచ్చరించాడు. మనం వెంటనేజాగ్రత్తపడాలి" అని ఆయా సము తీర్చుకున్నాడు.

శ్రీహరికి నవ్వు ఆగిందికాదు. గట్టిగా ఉరిమినట్లు నవ్వాడు. ఆ నవ్వు మరీభయంకలిగించింది వెంకటేశానికి.

"చెల్లీ! నేను చదువుకోడానికి తెచ్చే దీపం తీసుకురా" అని పిలిచాడు.

రాధ వీధిదీపం తెచ్చి వాళ్ళముందుంచింది. ఈ రహస్యం మరొకరితో చెప్పవద్దన్నట్లు చూశాడు శ్రీహరి. వెంకటేశం తెల్లబోయి చూస్తూ వుండిపోయాడు. అది భయమో, ఆశ్చ ర్యమో చెప్పలేం.

"అయితే కాంతారావు జ్వరం క్షణంలో తగ్గిపోగలదు. ఆ దెయ్యం జుట్టు నా చేతిలోనే వుందిగా"అన్నాడు నవ్వుతూ శ్రీహరి.

వెలుపల వర్షానికి గాలి సహకరించింది. అతని పాటలు గాలిలో కలిసిపోయాయి. ఆ వానవీటిలో కరిగిపోయాయి.

వీధి దీపం చీకటి కొప్పులో మందారపువ్వులా ప్రకాశిస్తూ అరుగుపైనే........

# చింత | అయాచితుల హనుమచ్ఛాస్త్రి

*[ప్రళయానంతరము మనువు ఒంటిపాటున హిమగిరి శిఖరముపై కూర్చుండి యుండును. ఎటు చూచిన ప్రళయ జలము.]*

శ్రీ హిమశిలోచ్ఛ్రయోత్తుంగ శిఖరి
పురుషుడొకడు ప్రస్తరచ్ఛాయ గూర్చుండిచూడ
సాగె జమరించు నయనకంజాతయుగళి
ప్రళయవేళామహాఝరీవాహధాటి.

తరళజలబిందుజాలమధ్యస్థలమున
గలదువాలిన నునుమంచు గడ్డపైన
గానవచ్చెడు; తత్త్వమొకండెగాదె
జడమొ, చేతనమో యేమిచనదు పేరు.

ఈ ఘనీభూత హిమము దానింతనేల
ప్రాకె; స్తబ్ధమతని హృదబ్జమ్ము భాతి
చలిత పవమానచరణ సంచారఘట్టి
తము, శిలావేది - నీరవతాసదృశము—

ఆ తపస్విరీతి సుదీర్ఘమై తనర్చు
దేవదారు తరుచయమ్ము తీర్చి నిలుచు
హిమధవళములు పాషాణసముములై చ
లించు జలితాకులను నిల్వారింపలేక.

అతడు తరుణతపస్వి యభ్యస్తసరణి
సాధనముచేయు దేవశ్మశానభూమి
పాదతలమున ప్రవహించు ప్రళయవారి
లహరు లువ్వెత్తుగా లేచి లయమునందు.

అవయవములు మాంసలములు
నవోజ్జ్వలము వీర్యమతని స్నాయువులఝరీ
జవధిక్కారము సేయుచు
ప్రవహించును స్వచ్ఛరక్తవాహినులెపుడున్.

పౌరుషోజ్జ్వలమైన తద్వదనసీమ
వంత బొగిలినరీతి గన్పట్టు జూవె
మతి యుపేక్షిత యౌవనమధురకుల్య
చెంగలించెడు లోలోన బొంగువెట్టి.

అలమహావటానద్ధము, యానపాత్ర
మిట్టనేల కట్టువడి తా మెదలలేదు
అంతకంతకు దిగజారు నా జల ప్ర
ళయము పైకి తెచ్చినది నల్లనగునేల.

కరుణావికలస్వన సం
భరితమగు నొక కథఘాంతి వ్యక్తమతని ము
ర్మర మర్మవేదన ప్రకృతి
గుఱుతించి నగవు గురిసిన కొమరొప్పుజుమీ.

"ఓసి! చింతాప్రథమరేఖ! యోసియోసి
విశ్వవనవాటికా పుష్పవిహరమాణ
భీషణ భుజంగినీ! యతిభీకరాగ్ని
పర్వతస్ఫోట సంజాత ప్రథమ కంప
సదృశ! ఉన్మత్తభామినీ చాలులేవె!

ఓయభావచాపలబాలికా! యహోసి!
మల్లలాటలిఖిత లేఖ! మద్హృదంత
రాంతరాళోత్థితావేదనార్చి! మృగమ
రీచి మాలికావాలుకోల్లిఖితరేఖ!

★ ★ ★

అయ్యో! విరిసినచేల సస్యములపాల
బడెడు బెడదయౌ వడగండ్లవానవోలె
నావరింతువు ప్రాణి హృదబ్జసీమ;
యెదల లోతుల దాగు సంపదవు నీవు!

'బుద్ధి' యట! 'మనీష' యట ప్రబుద్ధులెన్ని
యెన్నిసంబుద్ధులొనరించి యెన్నినారు?
'ఆశ'యట 'మతి'యట 'చింత'యట! ఒయారి
పాపమా! పొమ్ము నీకిట పనియె లేదు."

మూలం: జయశంకరప్రసాద్ 'కామాయని'

## యస్వీ జోగారావు | *సంధ్యాగీతము

ఇది చిత్రమైన కాలము. కళారంగమునందును కులమత రాజకీయాది విభేదములు యథేచ్ఛగా పాటింపబడుచున్న కాలము. నాగరికత మితిమీరి నంగనాచి నయగారములు నభినయములును ప్రబలిపోయిన కాలము. మందప్రజ్ఞులును మంది మద్దత్తువల్ల మహాకవులుగా చలామణి యగుచున్న కాలము. అసలైన మహాకవులు వసంతవిరహమున రుద్ధకంఠములైన కలకంఠములవలె మరుగుపడిన కాలము. ఇట్టి యీ కాలమున ఓఢ్రదేశమున తెలుగున కవిత్వము చెప్పు యోగము పట్టినవారిలో శ్రీ వజ్ఝల వేంకటేశ్వరకవిగా రొకరు.

రమారమి పాతికేండ్ల క్రిందట కతిపయాబ్దములు వేంకటకాళిదాసులను జంటకవులు శ్రుతిలయలుగా 'భారతి' బహువారములు కమ్ర కవితా గానము నాలపించినది. ఆ కవులలోని వేంకటేశ్వర కవిగారే వీరు. తదుపరి ప్రత్యేకముగను వీరు కొన్ని ప్రౌఢ కావ్యములను రచించిరి. అందు మొదటిది 'నౌకాభంగము' ముద్రితము. ఇది వారిచేతనే ఓఢ్రభాషలోని కనూదితమై ప్రచురితమై ఉత్కళ కవిపండిత ప్రకాండులచే బహుధా శ్లాఘింపబడినది. తెలుగు నౌకాభంగమునకు రాదగినంత ప్రతిష్ఠ రాలేదు. కారణము తెలుగువారికి గల సవర్ణ వ్యత్యయబుద్ధి యనుకొందును. ఇటీవల ప్రకటితమైనది వీరి 'అమరవీణ'. ఇది 1954-55 సంవత్సరములలో తెలుగు భాషాసమితి జరిపిన కావ్యముల పోటీలో ప్రథమ బహుమానము నందినది. తెలుగులో నిది యొక అపురూపమైన నిబద్ధ గేయ కావ్యము.

ఇక ప్రకృత మీ సంధ్యాగీత మిది యొక వింత సంతన. ఇందు మొదటిభాగము ప్రసిద్ధమైన కచదేవయానుల కథ యితివృత్తముగా గల కబ్బపు గున్న. ఇది యిప్పటికి పాతికేండ్ల పూర్వము అనగా కవి యొక్క ప్రథమావతీర్ణ యౌవనదశలో మధురశబ్ద ప్రౌఢ భావ దృఢ పరిష్వంగములో కులికిన యొక కబ్బపుకలికి.

ఒక సన్నివేశమున భిన్నలక్ష్యములు ప్రదర్శించిన రెండు పాత్రల యెడ సమానముగా సానుభూతి వహించుట సామాన్య పాఠకునికి కష్టసాధ్యమైన విషయము. కాని యొక సహృదయున కా సానుభూతి సమన్వయము నతి సమంజసముగా కుదుర్పగల సన్నివేశము లుండుట యన్నది అసహజము గాదు. అట్టి సన్నివేశములలో కచదేవయానుల సమావేశ మొకటి. కచుడు దేవకోటి ప్రార్థనపై తత్ప్రాణత్రాణ పరాయణుడై మృతసంజీవనీ విద్యాభ్యాసార్థము శుక్రుని కడకు వచ్చినాడు. శుక్రసుత దేవయాని అతనిని మనసార ప్రేమించినది. కచుడు రక్కసులవలన పలుయిక్కట్లకు లోనయ్యు ఆమె ప్రేమ యండగా చివరికి మృ సంజీవని సాధించినాడు. తోడన స్వర్గమునకు ప్రయాణము కట్టినాడు. దేవయాని ప్రాధేయపడినది. లాభము లేకపోయినది. అట్లు కచు డక్కడ శుక్రాశ్రమములో తన మనుగడ యంతయు నొక చక్కని యభినయముగా గడపి, తన వచ్చిన పని నెరవేరినంత దేవయాని పవిత్ర ప్రణయమును తృణీకరించిపోయినా డనగనే సాధారణముగ సహృదయుడైన ప్రతి పాఠకునికిని పరిదేవనమున

---

* రచన : శ్రీ వజ్ఝల వేంకటేశ్వరకవి

గూరిన దేవయాని యెడ సానుభూతియు, కచుని యెడ నేవము కోపమును గూడ పొడసూపును. కాని మరి యించుక ఉదారుడైన సహృదయునకు వెంటనే దైవకార్యమును మహత్తరముగా నెంచి తన్నిమిత్తము పలు బాములకు లోనై స్వార్థ త్యాగము చేసిన మహానుభావు డతని తితిక్ష, కార్య దీక్ష, ఉదాత్తలక్ష్య ప్రవణత్వము, స్వసుఖ విముఖ త్వము మున్నగు గుణగణములు స్ఫురించి అతని యెడ సానుభూతి పొటమరింపక పోదు. మధుర ప్రణయరస నిర్భరమైన మరుక్షణమున నే హృదయ పాత్ర చిదికి చిద్రుపలై వాపోవు దేవయానితోడి సానుభూతియు నా సహృదయుని హృదయమున ఆ ప్రక్క నల్లే యుండగలదు. ఇది యొక సున్నిత మైన సన్నివేశము.

ప్రపంచమున నించుమించు ప్రతి వాఙ్మయము నందును ఉత్తమ కవితగా పరిగణింపబడుచున్న పదార్థమునందు మూడు వంతుల ముప్పాతిక శృంగార ప్రధానమైనదే. అందు మరియు నుత్తమ మైనదిగా పరిగణింపబడునది యొక లోకోత్తర ప్రయోజనార్థము బలియైపోయిన పరిమిత వ్యక్తిక ప్రణయానుబంధము నిర్వృత్తముగా గలది. కచ దేవయానుల కథ యిందులకును లక్ష్యభూతముగా నిలువగలదు.

ఈ కథకు ప్రధానాకరము మహాభారతము. మహాకవి రవీంద్రుడు నీకథ యితివృత్తముగా నొక రమ్యమైన రూపకమును రచించియున్నాడు. అది కొంత యాధారముగా నీ పద్యకావ్యమును సంతరించినారు శ్రీ వేంకటేశ్వర కవిగారు.

ఇందు తొలిసంజ, మలిసంజ యను రెండు పాయలు గలవు. తొలిసంజ యంతయును, మలి సంజలో తొలిపాలును భారతమందలి కథ నిమిత్త మాత్రముగ సాగిన కవిగారి స్వతంత్ర రచన. మలి సంజ రెండవపాలు రవీంద్ర రూపకానువాదము. తొలిసంజలో రచన శ్రవ్య కావ్యధోరణిలో సాగి నది. మలిసంజలో నాటకీయమైన వాకోవాక్యశైలి పాటింపబడినది. తొలిసంజలో ప్రధానవిషయము శుక్రాశ్రమముకడ కచదేవయానుల సమావేశము. మలిసంజలో మృత సంజీవని సాధించి స్వర్గమనో న్ముఖుడైన కచునితో దేవయాని సంవాదము. ఆ మధ్య నధ్యాహార్యములు కచుని కష్టపాట్లు, శుక్రుని విద్యాదాన సందర్భము మున్నగు ఘట్ట ములు. తొలిసంజలో కచునియెడ దేవయానికి తొలిచూపులో వలపు తొలకరించినది. మలిసంజలో కచవియోగము, దేవయాని నిర్వేదము. సంధ్య యనగా రెండు భిన్నలక్షణములు గల కాలభాగ ముల ననుసంధించు ఆ నడిమి సమయము. అనగా ఒక నిర్దిష్టలక్షణముగల కాలము మరియొక విలక్షణ మైన కాలముగా పరిణమించునట్టి ముహూర్తము. తొలిసంజ యనగా ప్రాతస్సంధ్య. ఆ సమయము లోకమునకు వేకువ. ప్రస్తుతకథలో కచునిరాక ఎలజవ్వనియగు దేవయాని యెదలో తొలివలపు పాటకు పల్లవి. మలిసంజ యనగా సాయంసంధ్య. పగలు గడచి రాత్రి—వెలుగుపోక చీకటి రాక. అనగా ప్రస్తుతకథలో కచుని స్వర్గమనోద్యమము, దేవయాని వైరాగ్యము. రెండు సంజలును రాగ మయములే కాని యా రాగ పరిణామక్రమములు వేరు. కథలో నా కడల దేవయాని పరిస్థితి యట్టిది. సరిగా అయా సంధ్యారాగ పరిణామక్రమ సన్నిభము. ఆమె ప్రేమగీతికి పల్లవి పునశ్చరణ లేదు. రాగాలాపన మరి జరుగనేలేదు. కావ్య మునకు సంధ్యాగీతమను పేరెంతయు చక్కగ కుదిరియున్నది.

దేవయాని కడమ సామాన్య కావ్యనాయికల వంటిదిగాదు. ఆమె దొక ఉజ్జ్వలపాత్రము. ప్రణ యము నందును రాజస ప్రవృత్తి సమృద్ధిగా గలది. అందులకామె రక్షోగురుని కూరిమి పుత్రియగు టయేగాదు కారణము. కచుని నిరాకరణమును. అది యామె జీవితవైఖరినే మార్చివైచినది తొలి సారి మనసార వలచినవలపు విఫలమై గాసిచెందిన ముగ్ధహృదయము మరి ముగ్గకుండగనే ముదురు

వారును. పాపమట్లయినది దేవయాని పరిస్థితి. ఒక విధమైన సున్నితమైన మన స్తత్వముగల కవుల చూపునకు మాత్రమే అందునట్టి దాపాత్ర యాంతర్యము. మహాకవి రవీంద్రునకట్టి మానినీ హృదయ మర్మములు సమ్యగధిగతార్థములు. అతడు పౌరాణికగాథాప్రపంచమునుండి స్త్రీపాత్రల నేరికొని తీర్చినతీర్పు జూచినచో నీ విషయము విశదము కాగలదు. దేవయాని రూపకమునందును ఆయన యభినివేశమట్టిదే. ఆయన ఎత్తుకొన్న దామె ప్రణయ జీవితమున మలిసంజ ఘట్టము మాత్రమే. అందును భారతమునందువలె నాయికానాయకుల శాప ప్రతిశాపములకుకాదు ప్రాధాన్యము. విధి నియోగవియోగ విధురములగు వారి హృదయము లందలి వేదనాశ్రుతి స్పందనములకు.

కచుడు చిట్టచివరి వీడుకోలు వేడికోలుగా:

'...సౌందర్యోపాసన చేయరాని దగుచో, జ్ఞానార్జనమ్మే అసత్కార్యమ్మైనెడ, సత్యసాధనము దోసమ్మేని, మన్మానసాంతర్వ్యక్త ప్రణయమ్ము తప్పయిన నింతన్ గంటి శిక్షావిధిన్.

'...శాశ్వతమ్ముగా, తీరని ప్రేమ నా మది గదింపుచు నా కిక స్వర్గసీమ కానేరని స్వర్గసీమఁ గన నే పయనమ్మొనరింపగాఁ దగున్.'

'చిరకష్టానుభవోపలబ్ధమృత
సంజీవన్యభిజ్ఞాన మే
నెరిగింపన్ వలె దేవతావళికి
తన్వీ నాదు సౌఖ్యంబులన్
పరిశీలింపకమున్న; మద్వి
కలితాత్మక్లిష్ట యుష్మన్మనోం
తరబాధాద్విగుణీ కృతవ్యథుడనౌ
నన్నున్ క్షమింపంగదే!'

అని వక్కాణించినాడు. ఇందతడుత్తమ ప్రేమికుడుగా, ఉదాత్తధర్మ ప్రవణ్యుడుగా, స్వార్థత్యాగిగా నిరూపింపబడినాడు. ఆపాత్ర యోగ్యతకది పరమావధి. (భారతమున గురుపుత్రి 'సహోదరి' యను నింకొక ధర్మసూక్ష్మము పరమరమణీయముగా ప్రతిపాదింపబడినది.)

దేవయాని సమాధానము :

'ఏమి క్షమార్పణమ్మొ!
భరియింపగరాని క్షుధాగ్ని కేళికా
స్తోమము మేలుకొల్పితివి
ధూర్తుడ! నా హృదయంబులోన, నీ
కేమి, భవత్పురంబునకు
నేగి యశమ్ము గడించుకొందు వీ
కామిని కేమి యున్నదిక
కాంక్షలు జారిన జీవితమ్మునన్.

'అలరు లొలయించు వలపుతో అలముకొనిన
తలపు కంటక తల్పమై కలగు నేడు;
నా రహస్య లజ్జావమానములు వ్యథలు
గూర్చ జీవిత మూలమ్ము గొరుకునింక.

ప్రాయపు టెండసోకు
నెడ పాంథుని కై వడివచ్చి నా వన
చ్ఛాయల నిల్చి కాలహృతి
సల్పక పూవుల నెల్లకోసి నీ
వీ యెడ దండ యల్లితివి;
ఏగుచు నిప్డు తదీయసూత్రమ
య్యో యెడలించి త్రెంచెదు
గదోయి సుమమ్ములు ధూళి రాలగన్.

అని కటకటంబడి చివరికి—

'ప్రణయ భావమాధుర్యలవమ్మె నీదు
జీవితమునకు దూరమై పోవుగాక'

అని ప్రకృతార్థ సంవాదిగా తన కోపమును శాపముగా తెగించి తెనిగించినది. ఆ పంక్తులతో ఆ ప్రణయజీవిత సమాప్తియు, నీగ్రంథ పరిసమాప్తియు నగుచున్నవి. ఇచట ప్రణయతత్త్వమునకు మొగ్గుసూపు కవి హృదయమునందలి కావ్యనీతి ఖంగున మ్రోగినది. రెండుపాత్రలును సహృదయ పాఠకుని సానుభూతిని సమానముగా చూరగొనుచున్నవి. ఇంత రమణీయమైన రవీంద్రుని రూపక సన్నివేశమును స్వతంత్రరచనగనే భాసిల్లునట్లు

భావానుగుణ పదబంధ సుందరముగా తెనుగున దేర్చుటయ కాదు, ఆ భాగమునందే అచ్చముగా స్వకీయ భావనావిలసితములగు పద్యములు నొకకొన్ని హావణించినారు కవిగారు.

అవి 'తమకపు పారవశ్యమెడదన్...', 'ప్రియసఖ యే నొకర్తు', 'ఇంత విశాలమీ గగన...', 'ఆ తొలిసంజలో వెలుగులై' అనునవి.

ఇక కేవలము కవిగారి స్వకపోల కల్పితము లగు తొలిసంజను, మలిసంజ తొలిపాలును కొంత పరిశీలింతము. రవీంద్రుని రూపకేతివృత్తము కచదేవయానుల ప్రణయ కథలోని చరమ సన్నివేశము కాగా దాని కిదియంతయు పూర్వరంగము. ఇది యా రూపక ప్రతిపాదితమైన వారి ప్రణయ పరిణామమును క్రమోన్మీలితము చేయునట్లుగా రవీంద్రుడాశించిన కథా ప్రధాన ప్రయోజనమున కున్ముఖముగా సాగిపోయినది. అనవసర విశేషములు, నధిక ప్రసంగములును లేక విషయచాలనము, విపులవర్ణనా చాపలమును లేక వస్తువుకంటే భావతత్త్వము ప్రముఖమై యొక చక్కని వాతావరణము కల్పింపబడినది. రవీంద్రుని సన్నివేశ సౌధము నధిరోహించుటకు మన కవిగారు నిర్మించిన సోపాన సరణి ఎంత చక్కనిదని చెప్పను! చూడుడు :

'ప్రథమాగత స్నేహరస మహావేశమో
గాలిముత్తపు కెరటాల యుబుకు
వ్రీడాసమాశ్లిష్ట దృక్స్మిత ప్రేమమో
మొయిలులో తొలిచుక్క ముద్దువెలుగు,
చిరహృదంతఃబద్ధ నిరుపమ ప్రణయమో
పరువంపు మొగ్గల విరియు వలపు,
విరహాతిరేక విస్ఫురితానురాగమో
పడమటిరాగ సంపదల నొగను
ప్రియతిరస్కార విదళిత హృదయ శోక
రసమగు ధునీ ప్రవాహ తరంగ శీక
రాశ్రు సేచన మచటి దినావసాన
కాలము విషాద శృంగార కావ్యమగును.

శుక్రాశ్రమ వర్ణన సుందరముగా సాగుచున్నది. దానితోనే కావ్య ప్రరోచన. అచటి దివసావసాన కాలము విషాద శృంగార కావ్యమువలె నున్నదట! ఇదియొక చక్కని కావ్యార్థ సూచన. ఇందు గాలి కెరటాల యుబుకు, తొలి చుక్క పొడుపు, ముకుళ వికసనముల ప్రశంసలో దేవయాని యౌవన ప్రాదుర్భావము, ప్రియదర్శనము, రాగోదయములు సూచితములు. తదుపరి పడమటి రాగము మొదలగువాని ప్రసక్తిలో ఆమె వలపు ప్రొద్దు వాటారుట సూచితము. ఆమె ప్రణయ పరిణామ క్రమమది.

ఆశ్రమవర్ణన యనగా ప్రాదేశిక వర్ణనములే గాక సామయిక వర్ణనములును అనగా నచటి నదీ సైకతములు చెట్టుచేమలు, హరిణశాబకములు, కీరశారికలు మొదలగువాని వర్ణనమే కాదు 'ఆశ్రమ ప్రాంత మధుర సాయంతనములు', ప్రభాత సమయములు, దివసావసాన కాలముల వర్ణనములు గూడ చేయబడుట విశేషము. ఆ వర్ణనములలో అతిశయోక్తులు లేవు. ప్రతిపదమధురము లవి.

"శిష్యకోటీకంఠ నిష్యంది వేదోక్తి
మృదుగాన నవసుధార్ద్రీకృతములు
విమలవేణుమతీ పవిత్ర భంగావళీ
మంగళారావ సమ్మానితములు
ప్రతిసూన మకరంద పానకాంక్షా చర
ద్భ్రమరైక ఝుంకృతి ప్రకటితములు
సద్యస్సమాయాత సకలపక్షి వ్రాత
ముఖ సముద్గత గీత ముఖరితములు
అలస మరుదంకుర స్వర విలసితములు
గోకుల ముఖోద్గతాంభార వాకులములు
ప్రాణిహృదయ ప్రమోద సంపాదకములు
ఆశ్రమప్రాంత మధుర సాయంతనములు.

ఆశ్రమ వర్ణనాంతరము నాయికా నాయకుల ప్రథమ సమావేశమునకు ప్రాతిపదికగా, సముచితోద్దీపన విభావోపపన్నముగా, వసంతోద్యాన వర్ణనము లెత్తుకొనిన కవిగారి యభిజ్ఞత ప్రశంస

నీయము. మరియు ప్రశంసనీయమైనది ఆ వసంతా గమ సమున్మేషమును నాయికా యౌవనాభ్యుదయ ప్రశంసతో సమన్వయించి యెడనెడ భావి కథా సూచనా భాసురముగ చిత్రించిన కవి నేర్పు.

ఉదా :

'పలుకక అంతరంగమున
భద్రముగా నిడుకొన్న గాటపున్
వలపు తలంపువోలె
నెల ప్రాయపు తీయదనమ్ము గల్గు కో
ర్కులవలె, లేత నిద్దుర
లెరుంగు నగమ్ము సుఖంబువోలె పూ
వులు తమ యంతనే విరిసి
పోయిన వా మధువాసరంబులఁ
భ్రమరు డతిథిగ నేతేర వంచన మ్మొ
నర్చునని యెరుగని సుమనః కుమారి
వలచి తన హృదయమ్ము సర్వమ్మొసంగె
సకట భావి జీవిత వేదనానభిజ్ఞ!
అనుభవింపని వలపు, లానని మధువులు
ఆసనేయని సొబగులు, రాసి వడిన
ఆ వసంత కాలపు తొలిపూవు నవ్య
యౌవన శ్రీ విలాసిని దేవయాని.'

తదుపరి 'దేవమానినివలె నొప్పు దేవయాని' వాల కము బహు భంగులుగా మనోహరముగ మన కనులకు పొడగట్టును—జలకమాడిన దేవయాని, లతా సేచనము సేయు దేవయాని, పుష్పాపచయము చేయు దేవయాని—ఈ విధముగ.

'ప్రయత్నము లేక చిరప్రసుప్తముల్ ప్రాయపు కన్నువిప్పిన తలంపు లెవో పొడసూపు' దేవయానికి ఉద్యానవనములో సుమాపచయ సమయమున ప్రియునితో ప్రథమ సమాగమ మది యొక మధుర ఘట్టము. దేవయాని ముగ్ధసౌందర్యము నెడ కచుని హృదయము రసస్నిగ్ధమైన ఘట్టము. 'ఉభయహస్త విలూనము లుదయసూనములు పరస్పర సంయోగమున....ప్రథమ యౌవన పావన ప్రణయపూజ' ఘటించుకొన్న ఘట్టము. ఇక్కడికి తొలిసంజ.

మలిసంజలో తొలిపాలున—మరునాడు తన స్వస్థాన ప్రస్థాన మనగా మహోత్సాహ దోహల మానసుడు, మృతసంజీవనీ విద్యా పరిపూర్ణుడగు కచు డువ్విళులూరుచున్న ఆ తొలిరోజు, నాడు పూర్ణిమ. స్వర్గలోక మతని కనులకు గట్టినట్లున్నది. నాటిరాత్రియే దేవయానితో నతని చరమ సమావేశము.

"శ్రీమద్గాంగ తరంగ శీకర చయా
శ్లేషాభిరామా నిల
స్తోమా కృష్ట పరిమళ ప్రచుర
సద్యో విస్ఫురత్సూనముల్,
ప్రేమాలింగిత కిన్నరీ మధుర
తంత్రీగానముల్, నందనా
రామస్థానము లప్సరోజన విహా
రస్వైరతా ధీనముల్"

అని స్వర్గవర్ణన కుపక్రమించినాడు. ఉన్నటులుండి యుడువీథికి చూపు నిగిడ్చి 'పున్నమ చందమామ సురముఖ్యులకిచ్చు సుధాతిథేయి మీ వెన్నెల; పారిజాత సుమబృందము లచ్చరపిండు నవ్వులే వన్నెల చిన్నిచుక్కలు; నభమ్మున నిప్పుడు స్వర్గలోకపుం జిన్నెలె తోచుచున్నవి' అన్నాడు. అతని కారాత్రి ప్రకృతి రామణీయకము సర్వము స్వర్గ మార్గ పాథేయముగనే తోచినది. అప్పుడు దేవయాని—

'చిరుత నగవులు వెలయు నా చిన్ని మోవి
చుంబనమ్మున అమృతంబు చూరగొనవా!
తలపులో రహస్యమ్ముగా వలపు లీను
నట్టి నా సౌమనస్యంబు నరయలేవా!'

అని ముద్దులు గునిసినది—పాపమిక క్షణములో తన ప్రణయమునకు రానున్న ప్రళయమెరుగని బేల! అంత కచుడు—

'చెలియా, చిక్కని తీయ తేనియలు
వర్షించుంగదా నేడు నీ
పలుకుల్. నీ శుభమూర్తిలోన గల
ఆ స్వర్గమ్ము సర్వమ్ము ద

వ్వులలో గాక సమీపమై యిపుడు
పొల్పుంగాంచు సద్యోభవ
త్పులకశ్రీకర గాఢ తావక తనూ
ద్యుక్తానుషంగంబునన్.'

అని అచిరభావియగు తన స్వర్గమనమ్మును చమత్కారముగా ధ్వనింపజేసినాడు. ఆ తరువాతి పద్యమున 'అరుగంగా వలయున్ మదీయ నిలయంబౌ దేవతాసీమకున్' అని కచుడు తన పూనిక స్పష్టము చేయుటతో రవీంద్ర రూపకానువాదారంభము. దానికి ప్రస్తావనగా ఈ కవిగారు రచించిన పై భాగమెంతో వ్యంగ్యసౌరభము గుబాళించుచున్నది. రచన సర్వత్ర రసప్రసన్నముగ, అతిమాత్ర మనోజ్ఞముగ సాగినది. ఆ పద్యములొక్కొక్కటి యొక రసగుళిక.

కథ ప్రసిద్ధమైనదే కాని యిందు వస్తుతత్త్వమునకంటె భావతత్త్వమునకే ప్రాధాన్యము నిరూపింపబడినది. అదేకదా ప్రాచీనగాథలను కావ్యేతివృత్తములుగా గ్రహించు ప్రౌఢకవుల పరిపాటి. ఆ ప్రత్న వస్తువులనుండి యొక నూత్న భావమును పిండి సరిక్రొత్త కల్పనతో శిల్పచమత్కృతితో ప్రపంచించి తను యభిరుచి కనుగుణముగ నొక్కొకతరి యొక్కొక స్వతంత్ర ప్రయోజనమును ఉద్దేశింతురు వారు. అట్టి పరిపాటి పాటించి రవీంద్రుడు, వేంకటేశ్వర కవీంద్రుడు నిరువురును కృతకృత్యులైనారు.

ఇది ఖండకావ్యము. అనగా మహాకావ్యలక్షణైకదేశమైనదని ఆలంకారిక మతము. ఆలంకారికులు అష్టాదశవర్ణనా విశిష్టమైనది మహాకావ్యమనిరి. అనగా బహువర్ణనల కవకాశమిచ్చు బృహద్వస్తు సంపన్నమైనది మహాకావ్య మనియు, వర్ణనాల్పవస్తుపరిమితి గలది ఖండకావ్య మనియు వారి యుద్దేశముగా మనము గ్రహింపవలసి యుండును. ఖండకావ్యమునకు వారిచ్చిన యుదాహరణము మేఘసందేశము. కాని ఖండకావ్య విషయమున ఆధునికదృష్టి వేరు. ఒక కథయేకాదొకపాటి యుదంతము గాని, యొక చిన్న సన్నివేశముగాని, యొక పరిస్థితిగాని భావప్రధానముగ మలచబడిన కతిపయ పద్యపరిమితమగు నొక చిన్న ఖండికకును, అట్టి వివిధ భిన్నఖండికల సమాహారమునకును ఖండకావ్యమను వ్యవహారము నేడు గలదు. ఈ యాధునిక దృష్టిలో నిబద్ధేతివృత్తము, కతిపయశబ్దవ్యపదేశాతిశాయి శ్లోకసంఖ్యాకమును నగు మేఘసందేశము ఖండకావ్యముగాక కావ్యమే యగుచున్నది. కేవలము వస్తువిస్తృతినిబట్టి కాక కవితా మహత్తనుబట్టి మహాకావ్యవ్యపదేశము చేయుట నవభావుకదృష్టి. ఆపక్షమున మేఘసందేశముతోపాటీసంధ్యాగీతమును మహాకావ్యమనవలసి వచ్చును. కాని ఆలంకారికదృష్టిని, ఆధునికదృష్టిని పరిశీలించి సమన్వయముచేయ ప్రయత్నించినచో మహాకావ్య ఖండకావ్యములకు మధ్యస్థముగా నొక మార్గము గోచరింపక పోదు. ప్రకృతము నేను దీనిని ఖండకావ్యమనుటకే యిచ్చగింతును. అయితే ఒక మహాకావ్యమును వెలయించుటకు తగిన సామర్థ్యము, సాధన సంపత్తియు శ్రీ వఝ్ఝల వేంకటేశ్వర కవిగారికి గలవలని మాత్రము మనసార విశ్వసింతును.

ఈ సంధ్యాగీత కావ్యసంపుటములో 1933 సం. నుండి 1957 సం. వరకు వివిధ పత్రికలలో కవిగా రపుడపుడు రచించి ప్రచురించిన ఖండకృతులు నొక పదునైదు చేర్చబడినవి. అందు హృద్యమైన వైవిధ్యము గలదు. చక్కని గేయచ్ఛందస్సులును గ్రహింపబడినవి. ఆయా రచనలకు దారితీసిన పరిస్థితులును ప్రశస్తములైనవి. అందనేకము అనుభవసూనృతములు. అవి కవిగారిచేతనే పేర్కొనబడినవి. వ్యాసవిస్తరభీతి వాని నిచ్చట ప్రత్యేకముగ పేర్కొని సమీక్షింపజాలకున్నాను. మన కవిగారి లేఖిని యెప్పట్టునను మధురకవితావాహిని.

ఉపాధ్యాయుల నరసింహమూర్తి

# రసము : స్వస్థాన వేషభాషాభిమతము

కావ్యపరమార్థము రసానందమని వేఱ చెప్పనక్కఱలేదు. కావ్యపఠన సమకాలమున నీవ్యపదిష్టమార్గము ననుసరించి సహృదయుడే యానందమును పొందుచున్నాడు. కావ్యము వ్రాయుటలో గవి నిర్దేశించిన ప్రయోజనము సహృదయునకీ రసానందము కల్గించుటయే యనుటలో నెవ్వరికి నెట్టి విప్రతిపత్తిలేదు. ఏ దేశమందు కాని - ఏ కాలమందు కాని, ఏ కవియైననుగాని తన యభిప్రాయములో నెవ్వరు సహృదయులనుకొన్నాడో ఎవరుమెచ్చినచో దనప్రయత్నము సార్థకమగు ననుకొనునో అట్టివారి యభిరుచుల కనుగుణముగా దనకావ్యమును దీర్చిదిద్దును. అట్లు దిద్దనిచో నతని కావ్యమునకు లోకమున నాదృతియుండదు. సహృదయుల నాశ్రయించికదా కవికావ్యము పది కాలములపాటు నిల్చును. ప్రతి కవియు నెఱిగి కాని యెఱుగకకాని ఈ శాశ్వతత్వము గోరుచుండును. ఈ శాశ్వతత్వము సహృదయాధీనమగుట వారి యభిరుచుల నతడు తిరస్కరింపజాలడు. ఈ శాశ్వతత్వమును దాను గోరుచుంటినని యెఱిగిన కవి యట్టి శాశ్వతత్వ మెట్టి సహృదయులవలన సిద్ధించునో అట్టివారికై తనకావ్యమును వ్రాయును. అట్టివారి యభిరుచులనే పాటించును. భారతీయ కవితా సంప్రదాయ మంతయు నీ శాశ్వతత్వమన్న గుణము మీద నిర్మితమైనది. కవియన్నను - సహృదయుడన్నను దాత్కాలికమైన ప్రచారమును గాంక్షించినవారిని గుఱించికాని, గాసటబీసటే చదువువారిని గుఱించికాని వాడబడినవికావు. కావ్యమునకు సంబంధించినంతవఱకీ శాశ్వతత్వము పరమభావుకుల నాశ్రయించినది. సహృదయులనగా బరమభావుకులు. వారి మెప్పుకెక్కినవాడే కవి. కనుక కవి నిర్మించు కావ్యమునందు భావుకుని భావమునకు విచ్ఛేదము కల్గించునంశముండరాదు. అట్లున్నచో నది భావుకుని చర్వణామార్గమునుండి పరిచ్యుతిని చేయును. ఏ మాత్రపు దోషమైనను చాలు భావుకునకు హృదయోద్వేజనము కల్గించుటకు. చర్వణామార్గము కత్తిమీద నడకవంటిది.

ఈ భావుకు డెవ్వడు ? ఇతనియొక్క యభిరుచుల స్వరూపమేమి ? వీనిని కవియైనవాడు లెస్సగా పరిశీలించుకొనవలయును. భావనయనగా ప్రతిపాద్యమును పునః పునరనుసంధానము సేయుటయని సామాన్యముగా నర్థము చెప్పికొందము. కవి ప్రతిపాద్య వస్తువు విభావానుభావరూపముగ నుండును. విభావానుభావములను మించి కవి ప్రతిపాదింప గల్గినది మఱియొకటి లేదు. ఎందుచేతననగా బాహ్యజగత్తునందలి సర్వవిషయము కారణకార్య రూపముగ మాత్రముగనే యుండును. ఈ కారణ కార్యములు కవి పరిగృహీతములై తత్ప్రతిభా పరిష్కృతములై భావుకుని హృదయమునందు ప్రతిబింబితములైనప్పుడవి విభావానుభావములగును. కవి చేయుపని యేమనగా లౌకికవస్తువునందున్న దోషమును క్షాళన మొనరించి దానియందు గుణసంధానముచేసి సహృదయునకు సమర్పించుట మాత్రమే. ఈ లౌకిక వస్తువు రెండువిధములుగ మాత్రమేయుండును. ఒకటి నాయకాది రూపము, రెండవది చేష్టారూపము. నాయకాదులు కారణములు - చేష్టలు కార్యములు కవి ఈ నాయ

కాదులను దర్శేష్టలును గావ్యమునందు ప్రతిపాదించును. ఇవి భావుకుని హృదయమున ప్రతిబింబించును. ఆ యవస్థయందు వానికి విభావానుభావములని పేరు. మఱి నిర్వేదాదివ్యభిచారి భావములు - రత్యాదిస్థాయిభావములు నున్నవి, ఇవి మానసిక జగత్తునకు సంబంధించినవి. కవి కావ్యమునందు వీనిని వర్ణించుటకు వీలులేదు అందుచేత ననగా నివి భౌతికజగత్తునం దుపలభ్యమానములు కావు గాన వీనికి వాచ్యతాస్థితిలేదు. భావములకు భౌతికజగత్తునందు స్థితిలేదు. అందుచేత నవి కవి సంపాదితములు కానేరవు ఈ భావములు సర్వజనుల మనస్సులందువలె భావుకుని మనస్సునందు నున్నవి. కవిచేయవలసినపనియెల్ల నిరపేక్షములుగా ననగా సంబంధశూన్యములుగా వీనిని భావుకునకు ననుభవమునకు దెచ్చుటయే. సంబంధశూన్యముగా భావుకుని హృదయమున నీ భావోద్బోధనమును చేయుటయే సాధారణీకృతి యందురు. సాధారణీకృతి పొందిన యీ భావముల యనుభవమే రసమని స్థూలముగ చెప్పుకొందము. న్యాయమునకు రసమును పదమునకుమఱియు సూక్ష్మమైన యర్థమున్నది. దానివిచారము తరువాత. ప్రకృతమున కిట్లు చెప్పుకొన్నచో జాలును.

ఇట్టి భావోద్బోధనము విభావానుభావములవలన భావుకుని హృదయమునందు కవి యొనరించుచున్నాడు కవి చేయవలసినపని లౌకికవస్తువునకు విభావానుభావత్వ కల్పనము మాత్రమే యనుట స్పష్టము. విభావానుభావత్వమనగా కవి వర్ణితవస్తువు సహృదయ హృదయమునందు ప్రతిబింబించుట. సహృదయ హృదయమున ప్రతిబింబింపవలె ననగా గవి చేయవలసిన మొట్టమొదటిపని భావుకుని వర్ణ్యవస్తువువంక కాకర్షించుట. ఇది కవి యెట్లు చేయును? ఎట్లు చేయవలెను? దీనిని నిర్ణయించు కొనుటకు భావుకుని స్వభావము అతని యభిరుచుల ప్రసక్తి కలుగుచున్నది.

భావుకునకు కావ్యములను జదువుటవలన, ఆ చదివిన దానిని పునఃపునరనుసంధానము చేసికొనుటవలన నతని యభిరుచి సుపరిష్కృతమగును. ఇచ్చట సంప్రదాయము యొక్క విలువ యున్నది. ప్రతి భావుకుడు సువ్యవస్థితమైన సంప్రదాయ మార్గము ననుసరించి పరిష్కృతబుద్ధి యగుచున్నాడు. సంప్రదాయ పరిష్కృత బుద్ధివిశేషము కలవానినే సహృదయ భావుక శబ్దములచేత నాలంకారికులు నిర్దేశించిరి. నీవున్నావు. పూర్వ కావ్యములను జక్కగా చదువుకొంటివి. ఆకవుల యూహామార్గము చక్కగా నవగతము చేసికొంటివి. కవి సమయములు వారి రచనా విశేషములు వారి కథన కౌశలములు నొక్కమాటలో కావ్యనిర్మాణ రహస్య మంతయు దత్కావ్య నిరంతర సమనుశీలనాభ్యాసమున హృదయమునందు సంగ్రహించుకొంటివి ఇట్టి నీకు భావుకుడనిపేరు. ఇట్టి నీకొరకు కవి కావ్యమును వ్రాయుచున్నాడు అందుచేత కవి నీయభిరుచులను బాటింపవలెను. అనగా పూర్వ మహాకవి పరిపాటిని ఆశ్రయించవలెనన్న మాట. మఱి యొకరీతి వాదింపవచ్చును. పూర్వ మహాకవి కావ్యములను జదివినవాడే భావుకుడననేల? అట్లుకాక స్వతస్సిద్ధముగా నుండకూడదా? యని. అప్పుడు సంప్రదాయమునందు దీనికి పక్షపాత ముండవలసిన యగత్యము లేదుకదా. నీవు సంప్రదాయ పక్షపాత బుద్ధిని సుపరిష్కృతబుద్ధి యనుచున్నావు ఆ సంప్రదాయమును నతిక్రమించి చూచుశక్తి యతనికి లేదు. అతని హృదయము పరిశుద్ధముకాదు. అందుచేతనే సంప్రదాయము యొక్కగాని నీడపాఱని బుద్ధికలవాడు మాత్రమే భావుకుడనబడవలెను. వాని కొఱకై కావ్యము వ్రాయబడవలెనని.

ఈ వాద మాపాతరమణీయము. మనుష్య స్వభావమును లెస్సగా గుర్తించి పూర్వులు సంప్రదాయ నిర్మాణ మొనరించిరి. మనుష్యుడు పుట్టుటలోనే వానికి వాని మనోగత సర్వలక్ష

ణములకు ననుకూలమైన పరిస్థితిని చూచుకొని జనించును. ఒక్క మనుష్యుడే యననేల, యసలు సృష్టియొక్క మూల ధర్మమే యిది. నీవు పుట్టుటకు పూర్వమే నీ హృదయమునందు గొన్ని వాసనలున్నవి. ఆ వాసనలకు నీమనసుపైన నీ జన్మమును నిర్ణయించుటపైన మిక్కిలియధికారము కలదు. నీవొకచోట బుట్టితివనగా నిర్నిమిత్తముగ హఠాత్తుగ బుట్టలేదు. పుట్టిన తర్వాతకూడ నీ పెంపకము, నీ బ్రతుకు సర్వము నీ వాసనలచేతనే పరిపాలింపబడుచున్నది. అందుచేతనే సంప్రదాయము భావుకుని యభిరుచులను సుపరిష్కృతము లొనరించునంటిమి. సంప్రదాయ మభిరుచిని పుట్టింపదు. ఉన్న యభిరుచిని దిద్ది తీర్చునంతే. ఇప్పుడు నీవు చెప్పిన సంప్రదాయేతరబుద్ధి యున్నాడు. వానికి నభిరుచు లున్నవి. ఇవి జన్మాంతరమునుండి సంక్రమించినవి. కానివాని యొక్క స్పష్టాభివ్యక్తి వాని మనసునందు లేదు. ఆ యభిరుచులు మొద్దుగా నున్నవంతే. వాడు లోకములో జీవించుచున్నాడు. లోకమునందా యభిరుచుల ననుసరించి విషయముల నుపసేవించుచున్నాడు. ఈ విషయోపసేవ వలన నా యభిరుచులు లోకపరిధిని దాటని యనుభవమునందే పర్యవసించుచున్నవి. అట్టివాని యనుభూతి వట్టి లౌకికానుభూతి. ఈ లౌకికానుభవమును బట్టి నీ కావ్యము నతడు కొలువవచ్చును. అందువలన నీకుగాని, యతనికి గాని కలుగు ప్రయోజనమావంతయులేదు. ఒకకప్పు కాఫీ త్రాగుట ఎట్టిదో వానికి నీ కావ్యము చదువుటయు నట్టిదే.

లోకములో నచ్చమైన హృదయము కలవాడు లేనేలేడు; వాని హృదయమున సంప్రదాయపు నీడ పాఱలేదన్నచో నేదియో మఱియొక నీడ పాఱియే యున్నది. సంప్రదాయపు నీడ కల్పవృక్షపు నీడవంటిది. అసలది నీడ కానేకాదు. అంతకుపూర్వము వాని హృదయమున పాఱిన నీడల నన్నింటిని దొలగించు శక్తి దాని కున్నది. మణిదీపమునకు నీడ లేనట్లు దానికి నీడలేదు. దాని కున్నదల్ల వెలుగుమాత్రమే. ఈ వెల్గులు పాఱిన హృదయమునందు లౌకిక తమస్సులు పటాపంచలగును.

అనుకూలమైన వాతావరణమునందు కాని యే జంతువైనను పెరుగదు. కుఱ్ఱవాడు పుట్టినప్పటి నుండి యీ వాతావరణముయొక్క ప్రాబల్యము ననుభవించుచునే యుండును. దీని ముద్ర యతని మనస్సుపైన బాగుగా హత్తుకొనుచునే యుండును. చిన్నతనమునుండి దేవాలయములకు బోవుట, పురాణములు వినుట, తోలుబొమ్మలు-వీథి, నాటకములు - భరతనాట్యములు - భజనకీర్తనలు హరికథలుపన్యాసములు వీనియన్నింటిని వినుటవలన వాని హృదయమునందలి యభిరుచులు సుపరిష్కృతములగుచునే యున్నవి. వీని యన్నింటియందు నొక యవిచ్ఛిన్నమైన యనుగతి యున్నది. ఆ యనుగతి దేశీయత-జాతీయత యని చెప్పబడుచున్నది. ఆ భాష యా జాతియొక్క యాచార వ్యవహారములు; ఆ జాతి బ్రతుకులోని యనేక వైశిష్ట్యములు వారి జీవిత సర్వస్వమంతయు నీ దేశీయత, జాతీయత యన్నమాటలో సంగృహీతము లగుచున్నవి. కావ్యమునందు నీ విషయమునకు మిక్కిలి ప్రాధాన్యము కలదు. కుఱ్ఱవాడు పెరిగినకొలది వాని హృదయమునందు నీ జాతీయత దేశీయతలను గుఱించిన వైదగ్ధి పదనుదేరుచుండును. కావ్యమార్గము దీనికి బాగుగా పదనుబెట్టును. అందుచేత నీ దేశీయత జాతీయతల నాశ్రయించి కవి ప్రౌఢి యుండును. వాని నాశ్రయించి భావుకుడు భావుకత యుండును. ఇందుచేత నీ దేశీయత జాతీయతలు కావ్యమార్గమునకు ప్రాణభూతమైనవి. ఏ కావ్యమునందు నిది పరాంకోటిలో నుండునో ఆ కావ్యము పరమోత్తమమైనది. మలయపర్వతమునందు జందన వృక్షమువలె నా దేశపు జనుల దేశీయత జాతీయతలనుండి యా కావ్య ముద్భవించుచున్నది గావున యది "యావత్స్థాస్యంతి గిరయః"

యన్నమాట కుదాహరణమగును. దాని నెవ్వడు నెట్టి ప్రయత్నముచేతనైనను పెఱికివేయలేడు. ఈ దేశీయత జాతీయతల నాశ్రయించి సహృదయుని యభిరుచి సుపరిష్కృతమై యుండును గాబట్టి వీని యందు బరమవిదగ్ధుడైన కవిమాత్రమే వారి హృదయమును దనవంక కావర్జించుకొనగలడు. ఆ కావ్యమును జదివి సహృదయులు రసానుభూతిని పొందగలరు. అందుచేత రసానుభూతికిని ఈ దేశీయత జాతీయతలకును నెడతెగని సంబంధ మున్నది. ఈ యభిప్రాయము నే నన్నయభట్టారకుడు "స్వస్థాన వేషభాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః లోకే బహుమన్యంతే వైకృతకావ్యానిచ అన్యదప హాయ" యని చెప్పినాడు.

ఈ సూత్రమును లెస్సగా విచారించితిమేని కావ్యనిర్మాణ రహస్యమంతయు నిందిమిడి యున్నట్లు మనకు బోధపడగలదు. స్వస్థాన వేష భాషాభిమతాః, రసప్రలుబ్ధధియః, ఇవి రెండును "సంతః" అను పదములోనికి విశేషణములుగా నన్వయించుచున్నవి. ప్రధానముగా గావ్యపాఠకులు సత్పురుషులై యుండవలయును. సత్పురుషుడనగా సామాన్యముగా మనమనుకొను నర్థముగాదు. పరమేశ్వర విషయమునందు లగ్నమైన చిత్తవృత్తి గలవాడు సత్పురుషుడు. అనగా బరమార్థము కొఱకు బ్రతుకువాడు. లౌకికములైన ప్రయోజనములకొఱకు స్వవంచన పరవంచనముల జేసికొనని వాడు. ఇట్టివానియందు బూర్వముజెప్పిన చిత్తవృత్తి బహు సుకుమారముగ ముట్టుకొన్నచో గందిపోవున ట్లుండును. దీనినే చిత్తపరిపాక మందురు. ఇట్టి చిత్తపరిపాకము సజ్జనతాఫలము. ఇట్టి చిత్తపరిపాకముగల సత్పురుషుడు కావ్య విషయమున సహృదయుడు. అతని హృదయ మెప్పుడును లౌకికసంబంధ స్పర్శలేని నిష్కల్మష మైన, పరిశుద్ధమైన యానందమును గోరుచుండును. దీనినే యలౌకికానుభూతియని, రసమని యాలంకారికులు వ్యవహరించిరి. ఈరసమే న్యాయ్యమునకు నచ్చమైన పరమేశ్వర స్వరూపము. "రసోవై సః, రసగ్ంహ్యే వాయంలబ్ధ్వాఽఽనందీభవతి" అను నీశ్రుతిని జగన్నాథపండితు డీ సందర్భమున నుదహరించి యచ్ఛమైన యాత్మానందమే రసమని నిర్ణయించినాడు. అందుచేత రసము పరమేశ్వరస్వరూపము. 'సత్' అనగా నీపరమేశ్వర స్వరూపమే. ఇట్టి పరమేశ్వరానుభూతి కాంక్షించువాడు సత్పురుషుడు. 'రసప్రలుబ్ధధియః.' యన్నమాట సంతః అన్నమాటలోని యింత యర్థమును ప్రత్యాయత మొనరించి నిర్ధరించు చున్నది. సత్పురుషునిబుద్ధి రసలుబ్ధమై యుండితీరును. అందుచేత నతని మనస్సు కావ్యమార్గమునందు రసానుసంధానము జేసికొనుచు పోవుచుండును. ఈ రసానుసంధానము కావ్యగత శబ్దార్థములయందున్న యొకానొక విశిష్ట వ్యాపారము. అనుభూతి కవి బహుమార్గముల వెంట పొందును. కావ్యమునందు బహ్వంశములుండును. శబ్దార్థములను నాబహ్వంశముల కుపలక్షకములుగా గ్రహించిరి. అర్థాభిధానానుపయోగులైన యనుప్రాసములనుండి ప్రబంధ ధ్వనివఱకుగల సర్వాంశములు కవిపొందిన యాయనుభూతిని నిండించుకొని యుండును. అక్షరమున్నది, శబ్దమున్నది, వాక్యము పద్యమునున్నవి. వీనిలో నొక్కొక్కదాని సంయోజనము తరువాతిదానియం దున్నది. ఈయక్షరముల కూర్పు శబ్దములందు, ఆశబ్దముల కూర్పు వాక్యము నందు, ఆ వాక్యముల కూర్పు పద్యమునందు నొకానొక వైశిష్ట్యముతో, నొకానొక వైశిత్యముతో, నొకానొక ప్రత్యేకతతో గూడియున్నవి. దీనిని రచన యని యందురు. ఈ రచన బహు విశిష్టముగా చేయగల్గినచో దానిని రచనా ప్రౌఢి యందురు. ఇది వట్టి శబ్దమువఱకె. అర్థమునందు కూడ రచన యున్నది. ఆ రెండింటిని కలిపి చేసిన రచన యున్నది. వీనిని మీఱి కథారచన మున్నది. ఆ కథయందున్న బహ్వంశములను దీర్చుట వానిని ప్రధానాంశముతో నంగాంగి భావము చెడకుండ

లగింపజేయుట. ఇదికాక పాత్రల రచనమున్నది. వారి మనః ప్రవృత్తుల చిత్రణ ముండును. ఈ యన్నింటికి కావ్యమందు ప్రధానముగ దీపింపజేయ దగు నొక జీవితసత్య మున్నది. దీనిని జీవితసత్య మనుకంటె సృష్టి రహస్య మనవచ్చును. సృష్టి యందలి ప్రతి సంఘటనము ఏదియో ఒక రీతిని నా సృష్టిరహస్యమును వ్యాఖ్యానము చేయుచుండును. ఆ సృష్టియొక్క వైయర్థ్యమును భాసింపచేయు చుండును. జీవితమునందలి నిమ్నోన్నతములను వ్యక్తము సేయుచు జీవితము యొక్క దుఃఖ భూయిష్టత్వమును వ్యాఖ్యానము సేయుచుండును. ఈ సర్వము దుఃఖభూయిష్టము. నశ్వరము. ఇంతకు మించి పరమేశ్వర దీప్తి శాంతము. సనాతనము స్వచ్ఛమైన వెలుగొక డున్నదని తెలుపుచుండును. ఆసంఘటన మేకోణమునుండి యీసర్వవిషయము వ్యాఖ్యానము చేయుచున్నదో యాకోణమునం దా సంఘటనయొక్క యాత్మ యున్నది. ఆ యాత్మను బట్టికొని పైని చెప్పిన సర్వరచనమును నిర్ణయించుకొనుటలో కవి ప్రతిభ యున్నది. అందుచే రచనా సర్వస్వమునందు నా సంఘటనము యొక్క యాత్మ యుల్బణమై ప్రతీయమాన మగు చుండును. ఆ యాత్మను భావించుటవలన గవికి గల్గిన యావేశము, చిత్తదీప్తి, తన్మయత్వము, సర్వము నా రచనయందు వెల్లివిరియుచుండును. అందుచేత కవి రచనా సర్వస్వమునందు బాఠకునికి కవి పొందినయాపరమమైన యనుభూతిని వ్యక్తము సేయు శక్తి యున్నది. పాఠకు డనగా పూర్వము చెప్పిన రసప్రలుబ్ధధీకుడైన సత్పురుషుడు. అతనికి యీ సర్వమార్గములం దాపరమమైన యనుభూతి సంధానించుకొను నైపుణి యున్నది. అనగా కవి రచనయందున్న యీ శక్తి సహృదయుని హృద యమునందే పనిచేయునన్న మాట. ఈ శక్తిని అనగా నీ రసానుసంధానమును — రసనయని, వ్యంజనయని, ధ్వననమని, భావనయని యాలంకారి కులు నిర్దేశించిరి.

ఇదంతయు నేల చెప్పితిమనగా రస మనునది కావ్యైకదేశము కాదని. కావ్యగత సర్వాంశము లను భావించుటవలన దీప్యమానమగునని చెప్పుటకు.

రసానుభవ స్వరూప మిట్టిది కాన పూర్వము చెప్పిన యభిరుచుల ప్రసక్తి యిచ్చట వచ్చుచున్నది. బహుకావ్య పఠనాభ్యాసమువలన లోకపరిశీలనము వలన పైన చెప్పిన సహృదయుని హృదయమునం దీయభిరుచులు పదనుదేఱి యుండును. ఈ యభి రుచులకు వాని హృదయనిష్ఠమైన జన్మాంతర వాసనల నుద్దీప్తములను జేయుటలో మిక్కిలి ప్రాముఖ్యము న్నది. ఈ యభిరుచులకు దీప్తిరానిచో ఆ జన్మాంతర వాసన లుద్బోధితములు కావు. అవి యుద్బోధితములు కాక వానియందు రసాను భూతి ఉదయింపదు. ఇందుచేత రసానుభూతి మార్గమున నీ యభిరుచుల ప్రసక్తి కల్గును. మఱి యీ యభిరుచుల సహృదయుడు మహాకవుల పరిపాటి నాశ్రయించి లోకపరిశీలనము వలన నేర్పరచుకొన్నవి. ఏర్పరచుకొనుటకూడ కాదు. మనుష్య స్వభావమున కనుగుణమైన యభిరుచులివి యని నూడ పూర్వము చెప్పితిని. అందుచేత నివి వానికి సహజములు. ఈ యభిరుచులు స్థాన వేష భాషలకు సంబంధించినవి. వీనిని గురించిన యభి రుచులందు సహజత్వము లేనిచో వాని నభిరుచు లనుటకే వీలులేదు. వానియందు వానికి రమించు శక్తి యుండదు. ఈ యభిరుచులు రమణసాధన ములు. అనుభవ సాధనములు. వీనియందు స్వామ్యము లేనిహా డనుభవమునకు బాహిరమైన వాడు. స్వామ్య మనగా స్వత్వము ఇక్కడ స్వత్వము-స్వామ్యము సంబంధ విశేషమని పొరపడ కూడదు. వానియందు తాదాత్మ్య భావము అభేద ప్రతిపత్తి కల్గి యుండుటయే స్వత్వమన్నమాట కర్థము. అనగా నా యభిరుచులు వాని చిత్తవృత్తి యందు మిక్కిలి గాఢముగా నాటుకొనబడి యుండ వలెను. అట్లున్నప్పుడే వానియందు స్వత్వముండును తెనుగువానికి తెనుగుదేశమునందు, తెనుగు వేషము

నందు, తెనుగు భాషయందు సీతాదాత్మ్యభావ మీ యభేద ప్రతిపత్తి, యీ స్వత్వముండును. మఱి యొక భాషయందుండదు. మఱియొక స్థానమందు కాని, వేషమునందు కాని యుండదు. ఈ స్థాన దేశభాషలను గురించిన యభిరుచులు ప్రతివానికిని సహజములుగ నుండవలయునే కాని కృత్రిమములుగా నుండరాదు. ఇచ్చట స్థానమనగా స్థాన సంబంధి యాచారములు. వేషము ప్రసిద్ధమే. భాష- ఇచ్చట భాషయనగా వ్యవహారాపతితమైన రూపము కలదని కాని, కేవల శబ్దవిషయికమని గాని యర్థము చేసికొనరాదు. కావ్యభాషను గుఱించి బహు విషయములు చెప్పవలసిన యవసరమున్నది. కాని విస్తరభీతిచే వానినిచ్చట ప్రపంచించుటలేదు. లోక సిద్ధమైనది భాష. భాషకు సంబంధించిన సిద్ధి కవియైనవాడు లోకమునుండి గ్రహింపవలెను. ఇది పలుకుబడిరూపమున నుండును. కావ్యమునందీ పలుకుబడి కడుంగడు ప్రధానమైనది. ఈ పలుకుబడి నాశ్రయించియే యాయా భాషలయం దాయా మహాకవుల కావ్యములు సుప్రతిష్ఠితములై యున్నవి. పలుకుబడి పసందెరుగని కవి తక్కిన విషయములయం దెంత గొప్పవాడైనను బది కాలములపాటు కాలూది నిలువద్రొక్కికొనలేడు. భాషయొక్క ప్రాణమంతయు నీ పలుకుబడి నాశ్రయించి యుండును. ఈ పలుకుబడి యననేమి? కొంచెము విచారింతము. ఒక భాష మాట్లాడు జనుడు ఒకానొక భావముచేత నావిష్టుడైనప్పుడు, ఆ భావము స్వభాషయందే వైఖరిలో ప్రకటించునో యా వైఖరితో గూడిన శబ్దముల ప్రయోగము పలుకుబడి యని స్థూలముగ చెప్పికొందము. ఒకనికి కోపము వచ్చినది. ఆ కోపము వచ్చినవాడు మాట్లాడు వైఖరి వేఱు. అదిచూచి యతనికా కోపము వచ్చినదని మఱియొకడు చెప్పును. ఆ చెప్పు వైఖరి వేఱు. మఱియు నీకోపమును వ్యక్తము సేయుటలో మనుష్యులయొక్క యంతరువునుబట్టి లక్ష భేదమున్నది. ఆ కోపముయొక్క తీవ్రతలో బహుభేదమున్నది. వీని యన్నింటినిబట్టి యా వైఖరి నిర్ణీతమగుచుండును. ఇచ్చట భావమునందుకల జాతియొక్క ప్రసక్తి యున్నది. ఏజాతి భావమును తెనుగువాడే వైఖరిలో వ్యక్తము చేయునో యది పలుకుబడి. ఈ వైఖరి ఆ మాటలయొక్క రచనయందుండును. ముఖ్యముగా సహృదయుని యభిరుచి యంతయు నీపలుకుబడి నాశ్రయించియుండును. కావ్యగత సర్వాంశములీ పలుకుబడి నాశ్రయించి వ్యక్తములగుచుండును. లోకకావ్యానుశీలనమువల్ల సహృదయుని మనస్సీ పలుకుబడియందు మిక్కిలి పదును దేఱి యుండును. అందుచేత బలుకుబడి నాశ్రయించి రసానుభూతి కల్గుచున్నది. నిజమునకు స్వభాషయనగా నీ పలుకుబడియన్నమాట.

వట్టిమాటలు వాడుట పలుకుబడి కాదు. ఆ వైఖరితో యా మాటలను పదనుతో వాడుట పలుకుబడి. భాషాసిద్ధియనగా నిది. ఈపలుకుబడిలోని పదను జనుల వాగ్వ్యవహారమునం దనంతముగా నుండును. దీనిని కవిసహృదయులు సుష్ఠుగా వ్యాసంగ మొనరింపవలెను. అప్పుడుగాని వారికి దీనియందు సిద్ధి యుదయింపదు. అందుచేతనే మహాప్రభువైన నన్నయభట్టారకుడు సిద్ధిర్లోకాద్ధృశ్యా యన్నాడు. లోకజ్ఞత యన్నది కవికుండవలసిన మహాగుణములలో ప్రధానముగా బేర్కొన్నాడు. ఇది అనగా నీ భాషాసిద్ధి తల్లక్రిందులుగా దపస్సుచేసినను బరభాషయందు కలుగదు. భాషాసిద్ధిలేనిది రససిద్ధిలేదు. అందుచేత పరభాషా కావ్యములందు రసానుభూతి యుదయింపదు స్వభాషాకావ్యములందుమాత్రమే రసానుభూతి యుదయించును. పరభాషయందు నీవు పండితుడవగుచుంటివనగా నీవు ఆయా కవులు వ్రాసిన భాషనుచదివికొని యాయా శబ్దజాలములో నిబ్బందితో నీ భావములను వ్యక్తమొనర్చు నొకానొక పరిమిత జ్ఞానమును సంపాదించితివనిమాత్రమే యర్థము కాని నిజముగా పండితుడవైతివని మాత్రము కాదు. ఉదాహరణమున కింగ్లీషుభాష యున్నది. ఆ భాషయందు ఆ భాష నేర్చినవారిలో

పైన పేర్కొన్నసిద్ధి యెంతమంది కున్నది? ఒకవేళ యున్నచో నాయున్నవారు వ్రేళ్ళమీద లెక్కపెట్ట దగినంత మందికూడ లేరనుట నిర్వివాదము. ఇంగ్లీషుభాషలో భారతదేశములో గొప్ప పేరువడ్డ నొక కవయిత్రి కావ్యమును జదివి బెర్నార్డుషా ఆమె భాషాపాండిత్యమును జూచి నవ్వినాడట. వెనుక నొక పర్యాయము ఒక యూనివర్శిటీలో జోనాథన్ స్విఫ్ట్ వ్రాసిన 'ఏ టేల్ ఆఫ్ టబ్' అన్న గ్రంథమును బి. యే. కు పాఠ్యగ్రంథముగా నిర్ణయించి, దానిని పాఠము చెప్పువారు లేకపోవుట నిర్ణయమై యారునెలల తరువాత తొలగించిరి. కాని, యా గ్రంథము ఆంగ్లదేశములో, పిల్లలకు గూడ నర్థమగునది. అది యిచ్చట పాఠము చెప్పువారు లేరు. మన మింగ్లీషులో బండితులమను కొనుట యెంత హాస్యాస్పదముగ నుండునో దీనిని బట్టి గ్రహింపవచ్చును.

మన కేదియో కొన్నిశబ్దములకర్థము తెలినసింత మాత్రముచేత నా భాషయందు కొంత పరిజ్ఞాన ముండవచ్చునేమోగాని సిద్ధిమాత్ర ముండదు. భాషయనగా వట్టి శబ్దార్థములు మాత్రమేకాదు. దాని వెనుక యా భాషమాటలాడు ప్రజలయొక్క యాచారవ్యవహారములు, నాగరకత, భావప్రకటనావైఖరులు, ఆ దేశముయొక్క చరిత్ర, దాని వైశిష్ట్యము, ఒక్క మాటలో — ఆ జనుల బహుశతాబ్దులమీది జీవనసర్వస్వము, ఆజాతి జాతిసర్వము నున్నది. ఇది యంతయు దెలియుట యా భాష తెలియుట. తెలిసిగాని, తెలియకగాని యిది యంతయు నా భాష మాటలాడువానియొక్క రక్తమునందు జీర్ణించియుండి వాని వాక్కునందు గుబాళించుచుండును. ఈ గుబాళింపు పట్టుకొని కవి వ్రాయును. సహృదయు డానందించును. అందుచేత స్వస్థానవేషభాషాభిమతము కలవానికే రససిద్ధి కలుగుచున్నది. స్వభాషాకావ్యములందే సహృదయు డానందించుచున్నాడు. పరభాషా కావ్యములందు తాదృశరససిద్ధి లేదు గావున వానిని విడచుచున్నాడు. అందుచేతనే భట్టారకుడు "రసప్రలుబ్ధధియః లోకే బహుమన్యంతే వైకృత కావ్యానిచ అన్యదపహాయ" యని చెప్పెను.

# శరత్తు | వెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

ముదివగ్గు తలకట్టు చెదరిన కేశపాశముల వెన్నెలచాలు సాగిపోయె!
ప్రౌఢకాంతా కపోలముల గుంటలుపడు ఓరనవ్వున జ్యోత్స్నలూరిపారె!
ముగ్ధవధూమధుస్నిగ్ధాధర రహోవినిర్గత మాధురుల్ స్వర్గమయ్యె!
పసిపాపకన్నుల దుసికింతలో సుధాసిద్ధాంతకౌముదుల్ శృతినిమించె
కవికలాన అమృతకళలు బోదెలబొంగి విరహవార్తికముల దరహసించె!
విశ్వమెల్ల ఒక్క శాశ్వతపరిణాహదుగ్ధసాగరమున తొణుకులాడె!!

చెట్టెక్కి నవ్వుచు చిట్టచిటారి కొమ్మలల్ప్రాకి చీకటి నణగద్రొక్కె!
ఊషరక్షేత్రాల నుల్లాసముగనాడి పాలగచ్చునిచెప్పి భ్రమసిపోయె!
చాందినీగట్టి పసందుగ పంట కళ్ళాలపై తల్లిగా లాలిపాడె!
అభిసారికాపథ మ్మపహరించిన నిందమలసి శాపమున హిమానియయ్యె!
కవి గళాన విధురబాధలు గాథలై మిన్నుకంటమ్రోగి, వెన్నెలలత
ఆకు పూవుగూడ అవనియంతటరాల్చి క్రొత్తమొగ్గ దొడుగ కొసరిచూచె!

నవకమ్ముతో శరన్నర్తకి నటరాజు ప్రక్కనే లాస్యమ్ము పట్టినట్టు!
కన్నుమూసి విప్పుచున్న యల్లంతలో మంచుతెరజా నేలదించినట్లు!
పొట్లపూవులు బీరపూవులు కలబోసి జగతిపై నేసలు జల్లినట్లు!
తల్లి కౌగిలి చల్లదనములు జ్ఞప్తిలో తెల్లమై తీపులు త్రేణ్చినట్లు!
ఒక్క వత్సరమ్ము నొదిగి ఎక్కడో బోయి తిరిగి అప్పు దేగుదెంచినట్లు!
పంకిలమ్ముతేర—పరమకృపాపూర రమ్యరూపమై శరత్తు వచ్చె!—

ఒక ధర్మరాజును ఊరేచగా వెండి కాగడాల్ పట్టిన కాంతియగునొ!
ఒక పాలకెరటము ఉవ్వెత్తుగాలేచి పుడమిపై విరుచుకుపడినదేమొ!
ఒక విశ్వకవిభావమొరసిన కీర్తిగా పుచ్చపూవులు అరవిచ్చియుండు!
ఒక పూలసజ్జలో నుటికెడిపూవుల రజమెల్ల నెల్లెడ రాలిపడుటొ!
ఏమిటోగాని! ఈ శరత్తింత సుంత పారుపోకుండ సాలీని పటమునల్లి
చిక్కుకున్నది దానిలో, చిక్కనైన పద్యమునకవ్యాత్మగా పట్టువడుచు!

దూదిపింజలవోలె తూగాడు మబ్బులపైన బంగరుకాంతి పదునుపెట్టి !
పచ్చగన్నేరుల పంట వెన్నెలమీద సూదులవలెతాకి సురగబెట్టి !
పథముననేగెడు విధురయాత్రికులకు నొడలెల్ల నుమ్మగా నుడకబెట్టి !
క్రొత్తదుప్పటి విప్పి గుండెలపైదాక కప్పుకోవలెనన్న కాంక్షపెట్టి !
ఏమియోపెట్టనట్లుగా! ఇచ్చకములుకొసరి, బులిపించిగెలిపించుకొనెడు గడుసు
మాటకారిగవచ్చెను—మరపురాని ఈ శరద్రాత్రి ! కాశప్రకాశధాత్రి !—

ఒక తెల్లమబ్బుల సుకృతమ్ము వెల్లయావుల దొడ్డిమాదిరి కులకరించె !
ఒక తెల్లమబ్బుల నికరమ్ము కొంగలబారు మాదిరిగను పరువులెత్తె !
ఒక తెల్లమబ్బుల నికరమ్ము యోధుల శిబిరాలచాలుగా ప్రబలమయ్యె !
ఒక తెల్లమబ్బుల చికురమ్ము రెల్లు పూవులవోలె గాలికి కలకబారె !
శారదికరాత్రి గగనవిహారసీమ—చలువ ఇద్దరు మడతలు సర్దినట్లు !
పళ్ళెరాన ముత్యాలారపరచినట్లు చదలతారాడె నొకతెల్ల చిదురమబ్బు !

పుండరీకదళాక్షి మండలమకరంద మాధుర్యభావ ప్రమాణబుధము !
కోశాతకీ కుండలాశాంతకాంతి విదీర్ణ శుచిస్మిత దీప్తపదము !
క్షీరాబ్ధి వక్షోజభార భాస్వన్మాతృ వాత్సల్యాశయ్యా నవాశ్వయుజము !
జ్యోత్స్నదుకూలాచ్ఛశోభావిభావరీ మంజులాంగకరోచమానమహము !
కాశపేశలకుసుమ వికాసకలిత చలిత చరణానురణనశింజానరవమ
హామధురనృత్యకచ్ఛపీ మహితనదము - శారదామూర్తి నాహృది జాలువారు.

## 'ఒక విమర్శ'

అప్పుడు కాదుగదా ఇప్పటికీ దుర్గానంద్ గారికి సమాధానము వ్రాయవలెనన్న ఉద్దేశము నాకు లేదు. ఎందుకంటే సమాధానము ఎదురైన ప్రతి వాడికీ వ్రాయబడదు. ప్రమాణాలు భిన్నమైనచోట వాదప్రతివాదాలకి అవకాశము లేదు. నా బుద్ధికి యిది దోష మనిపిస్తున్నది కాబట్టి దోషమంటే, నా బుద్ధికి ఇది సాధువని తోస్తున్నది కాబట్టి సాధు వంటే, ఈ అన్నవాడి బుద్ధిబల మెంతది అనే ప్రశ్న పుట్టుతుంది కాని అక్కడ సమాధాన ప్రసక్తి లేదు.

మాకు కాళిదాసాదులు ప్రమాణము. సంస్కృతాంధ్ర మహాకవుల—వేమన గురజాడలు కాదు—ప్రయోగములు ప్రమాణము మీకు ఒక గేదెలబండ శివయ్య ప్రమాణము కావచ్చును. ఒక పత్రికా సంపాదకుడు ప్రమాణము కావచ్చును. అది మా దోషము కాదు.

ఆ బాలకాండములో దాదాపు రెండు వేల పద్యా లున్నవి కదా ! సంధీ, వ్యుత్పత్తీ, విగ్రహమూ, ఇత్యాదుల్లోని దోషాలు చర్చిస్తానని ఢంకా బజాయించి వాటి జోలికి పోకుండా జయంతి సంపాదకీయాలమీదికీ, అభిజ్ఞాన శాకుంతల వ్యాసాల మీదికీ, చివరకు 'పావకి' మీదికీ పోయి చేతులు కాల్చుకోవలసిన అవసరము ఏమి వచ్చిందీ అని ప్రశ్న.

రామాయణంలో ఒక కథ ఉన్నది. దుందుభిఅనే ఒక రాక్షసు డుండేవాడు. వాడు దున్నపోతు. (ఎవరినీ తిట్టటానికి కాదుసుమండీ - ఊరకే కథ చెబుతున్నాను) వాడు సముద్రుని మీదికీ, హిమాలయము మీదికి యుద్ధానికి వెళ్ళాడు. అబ్బాయి ! నీతో మా కెందుకుపో అన్నారు వాళ్ళు. వాడు వాలి మీదకు వెళ్ళాడు. సరే! తరువాత అయిందేదో అయింది. పోట్లాడుట కొంతమంది స్వభావము.

'శబ్దాలూ, అర్థాలూ తెలియవు' అన్నారని ఎవరిమీద విరుచుకపడితే ఏమి లాభము ? మన అదృష్టాన్ని నిందించుకోవాలి తప్ప. తెలియని విషయాలు తెలియవు అని చెప్పటకూడా దోషమేనా! నిజం చెప్పండి, మీకు ఆధ్యాత్మికాధిభౌతికశబ్దాల అర్థం తెలుసునా ? ఆచార్యకమన్న శబ్దానికి అర్థం తెలుసునా ? తెలిస్తే

'తమకున్న ఆచార్యకమ్మన్యతా బలముతో'

అని ఎందుకు ప్రయోగిస్తారు ? మొదటనే చెప్పినానుగా, ఈ విమర్శకమ్మన్యుల దంతా గేదెలబండ శివయ్య తంతు అని. 'తనయుడన్న సూక్ష్మతత్త్వము'ను పట్టుకొని ఎందుకా గోల ? కథాగతమైన పాత్రయొక్క మనః ప్రవృత్తి ప్రధానముగా ఈ వాక్యము విమర్శించవలె తప్ప ఇక్కడ వేదాంత చర్చ అనవసరమన్నాను తప్ప దానివల్ల ప్రతిపాద్యమైన అద్వైతం చెల్లాచెదరౌతుందని కాదు. మొదట పుత్రుడనే శబ్దానికి ఆచార్యభగవత్పాదులు ఏమి వ్యుత్పత్తి చెప్పినారో ఎవరినన్నా కనుక్కొని రండి. తరువాత తనయుడు సూక్ష్మతత్త్వమౌనా కాదా వాదిస్తాము. అయినా ఎవరి నడుగుతారు ? గే. బ. శివయ్యగారి నడిగి లాభం లేదుకదా ? ఎట్లామరి ?

విశ్వనాథ సత్యనారాయణగారు రామాయణం వ్రాస్తే అది జీవుని వేదన అయి నేను విమర్శ వ్రాస్తే అది జీవుని వేదన కాకపోతుందా ? అని వీరి ప్రశ్న. అయ్యో ! ఎందుకు కాదు ? అడుగడుగునా అంత యాతన (యాతనా తీవ్రవేదనా) దాచుకుందామన్నా దాగక కనబడుతుంటే ? ఎటు వచ్చీ పాపం ! ధూళిపాళ శ్రీరామమూర్తిగారికి ప్రాయశ్చిత్తము చేసుకోవలసిన అవసరముఏర్పడ్డది ఈ పురోడాశాన్ని ఇక ఆయన పరిహరించవలసిందే.

"అసలు ఆయన (విశ్వనాథ వారు) జీవుడుకంటే నా జీవుడే మంచివాడేమో" అని దుర్గానంద్ గారి మరొక సందేహము. ఆ విషయములో సందేహమెందుకు ? జీవుడికి మీరు చెప్పిన నిర్వచనాన్ని బట్టి మీ జీవుడితో పోటీపడడానికి ఎవ్వరూ రారు. 'మానవునిలోని మానవ శక్తులు క్షీణించినపుడు

మానవుడు జీవుడౌతాడు' అని కదా మీ నిర్వచనము. భవతు. అందుకే అన్నాను. ప్రమాణాలు భిన్నమైనచోట వాదన కవకాశం లేదని.

కవిత్వమునకూ సిద్ధాంతానికీ సంబంధము లేదని జయంతి సంపాదకీయములో వ్రాసినారట. దానికి ఈయన వాదన

"కుక్క చెప్పు కొరికెను. కుక్క కానిది చెప్పు కొరుకదు. కొరకబడుట దేనికి ఉన్నదో అది చెప్పు. కొరకబడుట లేనిది చెప్పు కాదు. చెప్పు కానిది కుక్క కొరకదు. అనగా కుక్క చెప్పు కొరకలేదని దీని యర్థము."

చూచినారా! అసలు స్వభావ మీ వాదములో పునః పునః కనబడుతున్నది. 'ఇదానీం ప్రకృతి మాపన్నః' ఈ స్వభావానికి తోడు సమాధానాలు కూడా కావాలా?

ప్రమాణాలు నిర్ణయించుకొని రామాయణ కల్పవృక్షములోని దోషాలు చూపించేవారికి ఇప్పటికీ స్వాగతము. సమాధానాలు కావలిస్తే వాళ్ళకు చెప్పగలము.

—జువ్వాడి రామేశ్వరరావు

ఈ దేశంలో విమర్శించే ఉత్సాహం అందరికీ ఉన్నది కాని విమర్శను సహించే ఓర్పు ఎవ్వరికీ లేదు. అయితే ఒక ప్రశ్న. ప్రతి విమర్శ సహించబడవలసిందేనా? ఇక్కడే సంపాదకుని ప్రమేయం వస్తుంది. వ్రాయబడ్డ విమర్శలన్నీ పత్రికల్లో ప్రచురణకు యోగ్యంగా వుండవు. ఒకవైపు విమర్శకుని తెలియనితనం వేయి విధాలుగా బయటపడుతుంటే, అర్థంకానితనం కనబడుతుంటే, అట్లాంటి వాటినికూడా ప్రచురించి సంపాదకులు ఇతరులను చిక్కులు పెట్టటం, తాము చిక్కుల్లో పడటం బాగా వుండదు.

పోగా దేశంలోని అన్ని సాహిత్యపత్రికలకు వారివారి సిద్ధాంతాలు ఉన్నట్టు లేవు. ఏదో రచయితలు వ్రాస్తున్నారు కాబట్టి మేము ప్రచురిస్తున్నామంటే కుదిరే విషయం కాదు. కొందరు పత్రికలున్నాయి కాబట్టే వ్రాస్తున్నారు. అవి లేకపోతే వాళ్ళు వ్రాయరు. వాళ్లు వ్రాస్తున్నారు. కాబట్టి మేము వేస్తున్నాము. వాళ్లు వేస్తున్నారు. కాబట్టి మేము వ్రాస్తున్నాము. ఇదెట్లా? అందుచేత రచయితల రచనలకూ ప్రయోజనం వుండాలి. సంపాదకుల ప్రచురణకూ ప్రయోజ ముండాలి.

మేమట్లాగే వేస్తాము అడగటానికి మీరెవ్వరు అంటే మేము మిమ్ము "సంఘాతకులు" అని అంటాం. మీకేమిటి అంటే వ్యవహారం మూలచ్ఛేదంగా ఉంటుంది.

కొందరు రచయితలు మేము భాషను ఉద్ధరించటానికి వ్రాస్తున్నాము అంటారు. రాజకీయుల దేశోద్ధరణలో ఎంత సత్యం ఉందో ఇందులోనూ అంతే సత్యం ఉంది. అసలు మిమ్ములను ఎవరుద్ధరించమన్నారు? తెలుగులో నాకు ముందు కథానిక లేదు నేను తీసుకవచ్చాను, నాకు ముందు హాస్యం లేదు. నేను తీసుకవచ్చాను అంటే అక్కడక్కడ వానికి మాతృకలు చూచి మీరు వాటిని తీసుకువచ్చారా? లేక ఋషుల్లాగా స్వయంగా దర్శించారా? సంస్కృతంలోనో ఇంగ్లీషులోనో మరే భాషలోనో ఆ సాహిత్య ప్రక్రియలను చూచి ఇల్లాంటిది చెప్పి తెలుగు దేశంలో కీర్తిని సంపాదించుకుందామనే చేశారుకదా? అంటే ఏదైనా స్వప్రయోజనార్థం చేశారని అర్థం. అంటే, భాషను ఉద్ధరిస్తున్నామన్న మాట రాజకీయుల దేశోద్ధరణ మన్నమాటవలెనే, లోకప్రతారణార్థం ఉపయోగిస్తున్నారని అర్థం. ఇందులో స్వయం ప్రతారణం కూడా లేకపోలేదు. ఎందుకంటే చాలామంది తమ మనస్సును తాము సరిగా పరీక్షించుకోలేక నిజంగానే తాము దేశోద్ధరణకో భాషోద్ధరణకో చేస్తున్నామని అనుకొంటారు కాబట్టి.

కొంతమంది మేము భాషకూ సాహిత్యానికీ సేవచేస్తూన్నామనిఅంటారు. దేశసేవ అనేశబ్దంఎంత

నేతిబీరకాయో ఈ సాహిత్యసేవ అనేది అంతే నేతిబీరకాయ. కొంతమంది దేశసేవకోసం పార్టీలు పెడతారు. వాళ్ళెంత దేశసేవ చేస్తున్నారో వీళ్ళూ అంతే సాహిత్యసేవలు చేస్తున్నారు. మరి సేవ జరగటంలేదా? అంటే జరుగుతే జరుగుతుంది లేకపోతే లేదు ఆ కార్యాని కది ప్రధానం కాదు. కాని ఆ కార్యంచేసేవాడు అప్రధానమైన ఈ ఫలితాన్నే ప్రధానంగా చెపుతాడు.

నేను ఎన్నికల్లో నిలబడతాను చందాఇవ్వండి. నేను పుస్తకం అచ్చువేయించుకుంటాను. చందా ఇవ్వండి. ఇద్దరిలో భేదంలేదు. ఆకలవుతోంది అన్నం పెట్టించండి. భార్యకు మందిప్పిచ్చుకోవాలి డబ్బివ్వండి. ఇల్లా అడుక్కునేవాళ్ళు మొదటి వాళ్ళకంటే సత్యవంతులు. అంటే మంచివాళ్ళు. కాని లోకం మొదటివారిని ఆదరించినంతగా రెండవ వారిని ఆదరించదు. అందుకే పక్కవాడు ఎంత బాధపడ్డా లెక్కచేయరు. వినోబావస్తే ఎంతో కొంత భూదానం చేస్తారు.

ఆ పార్టీలవాళ్ళకు దేశంమీద రాజ్యంచేయాలని వాంఛ.

ఈ సంఘాల వాళ్ళకు సాహిత్యాన్ని శాసించాలని వాంఛ,

వాళ్ళ నినాదం దేశసేవ, వీళ్ళ నినాదం సాహిత్యసేవ.

రాజకీయులకూ, సాహిత్యానికి భేదంలేదు.

ఎందుకంటే కామాది గుణాలకు మనష్యులందు భేదభావములేదు. అందుచేత రాజకీయులలో ఎంత కుళ్ళున్నదో సాహిత్యంలోనూ అంత కుళ్ళున్నది. అపవాదము లున్నవి. గాంధీజీ, వాల్మీకి మొదలైన వారు. ప్రజాసేవ భగవత్కైంకర్యముగా చేసేవారున్నారు. సాహిత్యమును ముక్త్యర్థముగా గైకొన్నవారూ ఉన్నారు.

గ్రాంథిక వ్యావహారిక భాషావాదా లున్నవి. గ్రాంథికంలో వ్రాస్తేనే శక్తి. వ్యావహారికంలోనే వ్రాస్తేనే అందం. గ్రాంథికంలో వ్రాసేవాడు గత శతాబ్దపు మనిసి. వ్యావహారికంలో వ్రాసేవాడు భాషరానివాడు. ఇదంతా వ్యర్థవాదన. ఎవడూ ఏదీకాదు. పలుకులోని చేవముఖ్యం కాని ఇవికావు. ఎవళ్ళ ప్రకృతులకు సరిపడేభాష వాళ్లు వ్రాస్తారు. ఒక్కొక్కడు వ్రాస్తే పరమ రమణీయంగా ఉంటుంది. ఇంకొకడువ్రాస్తే లేటైన రైలుబండికోసం ఎదురుచూస్తూ కూచున్నట్టుగా ఉంటుంది. ఆ భేదం గ్రాంథిక వ్యవహారభేదాలవల్ల కాదు. దానికెంతో ఉన్నది. అంతా త్రవ్వటం అనవసరం. పరమేశ్వర ప్రాప్తికి అనేక మార్గాలున్నవి. అందరూ నా మార్గమే పట్టాలనేవాడు దురభిమానదూషితుడు.

—దామెర్ల మల్లారెడ్డి

విశ్వనాథ సత్యనారాయణ | మృత్యుజయము

సిద్ధార్థుడు తపసునకై అద్దమరే బయలుదేరి
అరిగినాడు తిరిగిరాడు
శుద్ధోదనుండు పుత్రుని
బద్ధింపగ ఊళ్ళున్ను బావులు చెరువులు వెదకించెను.
నాల్గవరోజున చెన్నడు గుఱ్ఱముతో తిరిగివచ్చి
శుద్ధోదనునకు కథ వినిపించెను.

లేక లేక కొడుకు కలిగి వయసువచ్చి బుద్ధి కలిగి
పెండ్లియాడి కొడుకు బుట్టి
యువరాజగు సమకొను సమయములో లేచిపోయె
గుడ్డిలోనమెల్ల మనుమడు మాత్ర మొక్కడుండి
శుద్ధోదనునకు నాంతరయుద్ధములో గెలుపు గలిగె
సర్వసృష్టియొక్క మర్మ మర్వాచీనముగా కన్పడె
పొమగుపడియె దుఃఖాగ్నియు
ఎంతకాదటన్నగాని సుంతదుఃఖముండుగదా !

సిద్ధార్థుడు తిరిగివచ్చె బుద్ధుడై కపిలవస్తు పురమునకును
శృంగారరసమ్మునకును శృంగభంగమొనరించిన
జంగమయ్యవంటి మగని సందర్శనమునకు యశోధర
చెంగలించు కనులతోడ చేరవచ్చెనమకోవలె.

వరరాజ్యము గెలువలేదు ప్రభువుకొడుకు వచ్చెననుచు
వరరాజ్యము గెలిచినాడు ప్రభువు కొడుకు వచ్చెననుచు
పడతులు కిటికీలందున పయ్యెదలను సవరించుచు
నిడివికనుల జిగివెలుగులు నింగియందు ప్రసరించుచు
నృపతిసుతు కషాయాంబరనిర్మలరోచులు చూచిరి
తరువులపై గోడలపై దారిపోవు బండ్లపుచు
గూడులపై మేడలపై నిలబడి జనములు చూచిరి.

సిద్ధార్థుడు శిష్యులతో దారివెంట నడచుచుండె
అటవి పదములు మాత్రము రాజాంతఃపురమునకై
చేతము మళ్ళినయట్టుల చెప్పలేదు గిప్పలేదు

వారిలోన నొక శిష్యుడు పరమగురువుతో నిట్లనె
తండ్రిగారు మిముజూడగ తహతహపడుచున్నారేమో
తండ్రిని చని దర్శించుట ధర్మమంచు నే తలతును
శిష్యుని మాటలు వించును సిద్ధార్థుండిట్లనియెను
'ప్రేష్యుడు సుతుడును జనకుడు యజమానియు ననిపించును
నేను మృత్యువును గెలిచితిని నిస్సంగుడనైయుంటిని
తండ్రిలేడు తల్లిలేదు తనయుడనుచు లేదు నాకు.'
గురువుమాట విని శిష్యుడు కొసమనసున నిట్లనుకొనె
తండ్రిలేడు తల్లిలేదు తనయుడులేడని యననగు
గురువుకలడు శిష్యులగమి కూడ గలదు కాదందుమె ?

చిత్తమేమి చెప్పెనొక్కొ సిద్ధార్థుడు తనచరణము
లొత్తి రాజగృహమువైపు ఊగినడువగా సాగెను
శిష్యులు వెంబడిపోయిరి ప్రేష్యులుకావున వారలు
సిద్ధార్థుడు లోనుకొనె చేరవచ్చినంత తాను
శుద్ధోదనమహారాజు చెందియున్న దుఃఖముతో
కన్నులలో నీటితోడ కౌగిలించుకొనునంచును
కౌగిలింత వదలించుక గాంభీర్యముగల కన్నుల
నిర్వాణపు సిద్ధాంతము నిలచి బోధ చేయగవలెనని.

రాజగృహమ్మునకేగెను రాజు తన్ను చూచుటకై
రానేలేదందుచేత రాక వృథాయని తలచెను
తిరిగి పోవ యత్నింపగ తిరిగి శిష్యుడిట్లు చెప్పె
వచ్చినవారల మెట్లును వచ్చినాముగద స్వామీ
ఎచ్చట జనకుడు కలడో అచ్చటికే పోదమంచు
వెనుకకు ముందాడి యోగి వెళ్ళుట నిశ్చయపరచెను.

శుద్ధోదన మహారాజు సుతవియోగ దుఃఖితుడును
బద్ధపరిజ్ఞానుండును ప్రభువై యుండెను లోపల
ద్వారమందు కనిపించెను తనయుడైన సిద్ధార్థుడు
ధారుణిపతి గుర్తింపగ తడవుచేసె కానిగుడ్డ
బోడిబుఱ్ఱ చేతనున్న పొతుగై యొప్పిన కష్టియు

మారిన తన వేసము గుర్తింపగ నేరపీయదని తెలియక
ఊరక సిద్ధార్థుడు తనలో ఉమ్మలించె క్రుమ్మరించె క్రొవ్వగ.

నిగిడి తిరిగి పోవనెంచు నిముసములో గుర్తుపట్టి
నగము మ్రింగినట్టి దుఃఖసంగత వాక్యమ్ములతో
శుద్ధోదన మహారాజు సుతుపతోడ నిట్లనియెను.
ఇది యేమిటి ఈవేసము ఏబైరాగులలో చేరితి ?
మది నేటికి మన్నించితి మరలిరాను తండ్రి యిల్లు
అన్నియు వదలినదానికి అనదరూపు చిన్నెయైన
వన్నేటికి వదలబడని నాజెముగా మన్నించెదు ?

సిద్ధార్థుని యాననమున చిన్నగాగ కోపరేఖ
బద్ధమైన యది కనుగొని పలికె తిమ్మడీ విధముగ
గురువు మృత్యువును జయించె కూడియున్న దేహమునకు
గురువు మీరలగుటచేత కూడ వచ్చు మిము జూడగ
ఇందులోన తప్పులేదు ఇది ధర్మములకు మొదటిది
మరియు గురువు మిమ్ము చూడ మా చెప్పిన మాటంబడి
యరుగుదెంచె గాని స్వతోబుద్ధిచేత రాలేదును
అనగా ధారుణీపతి యిట్లనె 'అంతమాత్రమైన ధర్మ
గుణము మిగిలెనన్న దానికొఱకైనను సంతోషింతును.'

తండ్రి కనుల యందు నీరు తాల్చలేదు సరేకదా
తండ్రి వచ్చి కౌగిలించి తాపపడడు సరేకదా
తన సాధించిన నిర్వాణపథమ్మునె గుర్తెరుగక యుండెను
తన గెలిచిన మృత్యు గూర్చి తండ్రికి చెప్పదలంచెను
'రాజా ! వ్యర్థము లోకము రాజు లేడు ప్రజ లేదు
తండ్రి లేడు కొడుకు లేడు తాను లేడు ఏమిలేదు
ఇదియంతయు భ్రాంతి సుమీ ఈ సృష్టి వృథా భ్రాంతియ
పదిమందియు చచ్చుచుండి బాధలు పడుచున్నారిట
మృత్యువేమొ సర్వజనుల మ్రింగిపోవుచున్నది యట
మృత్యువు గెలుచుపథ మ్మధిగమించితి నే తపసుచేత
దానిని లోకమునందున నానా జనులకు చెప్పెద
దానికోస మెత్తితి నవతారమ్మును నే ననుకొనియెద.'

నివ్వెరపడినట్లుగ ధరణీపతి కొడుకును గన్గొని
'దవ్వుగ వచ్చితి విచటికి తరలిరావు నిన్నటికే
ఎవ్వడో పదేండ్ల కుఱ్ఱడు మృత్యువుపొందెను నిన్ననె
నిన్న వచ్చియున్న నీవు నిజముగ బ్రతికియె యుండును
తన్న కొడుకువాట వన్నెనను తావుమయ్య మృతి కనకుండగ
మన్ను దేహ మిదియేమొ మ్రగ్గిపోయి చెడకుండగ.'

అన్న మాటలకు బుద్ధుడు హాస్యము మొగమున తోచగ
నాన్నతోడ నిట్లనియెను 'నాపని అది కానేకాదు
భ్రాంతిచేత లోకమ్మిది పాడైపోవుచున్నది
భ్రాంతిలేకయుండ నిర్వాణమ్మును పట్టించుటయే నాపని
చెడిసిపోవు దేహము నిలబెట్టంగా లేడెవ్వడు
కడువడి భ్రాంతిని తొలగించుటకై కావించితి నే తపమును'

అనగా ధారుణీపతి యిట్లనియెను సిద్ధార్థునితో
'భ్రాంతితొలగు టెవ్వరికో పండితులకు నది తొలగును
పసివాండ్రై చత్తురుగద వారు మృతిం గనకుండగ
నిపలగు సిద్ధాంతమ్మును చేసితివా చూచితివా
ముసరుచున్న భ్రాంతి తొలగిపోవ నీవు గాని క్రొత్త
మసలెడు సిద్ధాంతమేమి మసలించితివో చెప్పుము
ఆదినుండి భ్రాంతియన్న ఆర్షమైన సిద్ధాంతము
పాదుకొనియె నిచట నెపుడు భ్రాంతియొకటె పోదుగాని
నీదగు సిద్ధాంతములో నిలచెనేమొ క్రొత్త భ్రాంతి
వాదించెదు మృత్యువు చలపాదించితినంచు నీవు
మృత్యువు గెలుచుట యనగా నెడదలోన మనసులోన
అత్యధికమ్ముగ నూహల అంతనంత పెంచి పెంచి
ఏదియు లేదని చెప్పుచు వాదించుట కాదు కాదు
వాదించిన నొక్కప్పుడు వాదియందునా దుఃఖము
పాదుపెల్లగిలిన గిల్లున సర్వధాత్రి కిది చెల్లదు
ఎవ్వడు మృత్యువు గెల్చితి నేనటంచు చెప్పవలయు
ఎవ్వడు ధాత్రిని మృత్యువు నింతయైన నిలువనీక
క్రొవ్వాడి శరమ్ముల కవ్వడి కూల్చినాడొ శత్రువులను
అవ్వాడిగ చావు ధాత్రినుండి అదలించినవాడనవలె
నిన్న కుఱ్ఱవాడు చచ్చె నేడు నేను చావచ్చును
మొన్న నెవ్వడో చచ్చెను పుడమి తేపు ఎల్లుండియు
తిన్నగా జనుల్ చత్తురు చచ్చుట తెలిసినంతనే
మృత్యువును
కొన్నవాడ బందీగా నన్నది హాస్యాస్పదమౌ వాక్యము
తలపగ నీవే మృత్యువు గెలిచితినని చెప్పెదేని
అల నిన్నను చనిపోయిన పిల్లవాని కొనితెమ్మిటకును
లేదా లోకమునందున లేదు మృత్యు వనరాదెప్పుడు
పోదము వెదకుచు నెవడో పొందును మృత్యువు నేడే
వానిని బ్రతికించుము మృత్యువు గెలిచినవాడవనుచు
నుతియింతును
కాదా నీ సిద్ధాంతము క్రొత్తకాదు మా కేనాడో
వేదమ్ములలో నదియును పెద్దగాగ చెప్పబడియె
వాదించకు నా తోడుత వల్లమాలినట్టి బరువు.'

తండ్రిని కని సిద్ధార్థుడు తనలో నిట్లు తలంచెను
మోహము విడ దీయనకును బోధించిచెప్పి యేమి ఫలము ?
అనుకొని యిట్లని చెప్పెను 'అది ప్రాతవదో వైఖరి
సదమలగతి నిర్వాణము సంపాదింపగ నాతో రా
తండ్రివనుచు నీ తోడను తగవు చెప్పుటకు వచ్చితి
తిండ్రించిన శిష్యుల యొత్తిడిచేతనె వచ్చితి.'

శుద్ధోదను డిట్లనియెను 'సుతుడవంచు నే చెప్పెద
బద్ధమయ్యె మృతి యిచ్చట. పాయగరాదది యిచ్చటి
బుద్ధిలోన ముక్తుడవై పోయినచో పోవయ్యా
సిద్ధార్థా ! మృత్యువు నే గెలిచితినని చెప్పుటకును
నీవు దొక్కండె సమర్థుడు-
తనకు దాను గెలువవచ్చు దారుణిచే గెలిపించెద
ననుటకన్న మోసమంచు నవనిలోన నుండబోదు.'

'రేడియో శ్రోతృలోకం' ఒకాయన, 22 వ అక్టోబరు 'వాణి' సంచికలో 'రేడియోలో మాట్లాడే వారి కొరకలేఖ' వ్రాసారు. దానిలో ఆయనగారు '*ఏదైనప్పటికీ రాయవలసిన విషయాన్ని స్ఫుటంగా ముందు అవగాహన చేసుకోండి*' అని వ్రాసారు. 14 వ నవంబరున శ్రోతల ఉత్తరాలకు జవాబుల కార్యక్రమంలో హైద్రాబాదు కేంద్రం వారు ఈ లేఖలోని పది పేరాలనే పునరావృత్తి చేసారు.

అయితే, ఇంతకూ వ్రాసేదేమిటంటే-'అయ్యా! మీరు సూచనలిస్తున్నారు, బాగానేఉంది. మరి మీ '*రేడియో ఆర్టిస్టు*' లే వాటిని పాటించరేం? అని. ఉదాహరణ కావాలా? 19 వ అక్టోబరున వింజమూరి శివరామారావుగారి - ప్రసారమైన-నాటిక. విశ్వనాథ సత్యనారాయణగారి ఏకవీర నవల ఆధారంగా వ్రాసినదాని పేరూ 'ఏకవీర'. రచయిత ఏకవీర నవలను సరిగా అవగాహన చేసికోలేదని ఆనాటిక చెపుతున్నది... 'ఏకవీర' నవల పూర్తిగా ధర్మాభిముఖంగా నడుస్తుంది. ధర్మయుతమైన ప్రేమపైనే ఆ నవల ఆధారపడింది. అందుకే అవ్వయ్యార్ యొక్క 'అరంశెయ్యవిరుంబు' అనే వాక్యం దానికి ప్రాణభూతమయింది... ఈ నవలయొక్క అందమంతా కల్పనమీద ఆధారపడి ఉంది. పాత్రలలో ఒకరికి తెలియకుండా మరొకరు, వేరొకరికి కావలసినవారిని ప్రేమించడం తెలుస్తున్నట్టుగానే అనిపిస్తూ తెలియని విషయం అది. ఈ రహస్యం చివరకు విచ్చిపోవడం, ధర్మానికి ప్రాధాన్యం కల్గడమూన్నూ నవలలో ఉన్నవి. ఇవన్నీ నాటికలో గమనింపబడలేదు. 'ఈలోకంలో ప్రేమకు తావులేదు. ప్రేమించే హృదయానికి శాంతిలేదు' అనే నాటికలోని ప్రతిపాదన నవలకు విరుద్ధమైంది. ధర్మవ్యతిక్రమణ జరగడంలో శాంతి లేదని అనుకోవచ్చు కాని కొందరు 'ప్రేమ తత్త్వోపాసకులు' చివరకు విసిగి అనుకొనే పై మాటలకు నవల ఆస్కారం ఈయదు. సత్యనారాయణగారు ఆయన ధోరణిలో ఆయన నవల వ్రాసుకొని పాత్రలకొక నిర్దిష్టమైన రూపకల్పన చేసారుగదా! మరి అది ఆధారంగా సాగినప్పుడు 'మన కవిత్వం' మధ్యలో ఎందుకు? ఏకవీర సంపెంగ పూవువంటిదనే కల్పన నాటికాకర్త యొక్క స్వకపోల కల్పితం. అయ్యా! ఏకవీర సంపంగి పువ్వు కాదని మనవి. సంపెంగ పువ్వుమీద తుమ్మెదలు వ్రాలవని ప్రశస్తి. సంపెంగకు ఏకవీరకు అసలే పోలికలేదు. కుట్టాన్ ఏకవీరయందు చివరకు అభిరతుడు. ఆమె తనకథ చెప్పినా కూడా అభిరతుడే అవుతాడు. తనధర్మవ్యతిక్రమంవల్ల తానే కావాలన్నట్టు త్యక్తప్రాణ అవుతుంది ఏకవీర....పాత్రల నిర్దిష్టరూపమూ ఇందులో చెడింది. కుట్టాన్ తల్లి, కుట్టాన్‌తో అతనితండ్రినిగూర్చి 'నిక్షేపం'లా ఉన్నారంటుంది. ఈ సందర్భంలో నవలలోఉన్న మాటలే ఉంచితే ఎంత బాగుండేది? ఏకవీర విషయం ప్రస్తావించి తల్లి నవలలో 'భార్యాభర్తలు మీకు నేను చెప్పవలెనా?' అంటుంది. నాటికలో 'నీకు చెప్పవగినదాన్ని కాదు' అంటుంది. పాత్ర చిత్రణలో ఎంత తేడావచ్చిందో చూట్టానికిది చాలు. కల్పనలోకూడా లోపంఉంది. వీరభూపతి మీనాక్షితోడి తనగాథ కుట్టాన్‌కి చెప్పుతూ అత్తగారి ఊరిపేరు చెప్పేటప్పటికి కుట్టాన్ 'మామేన మామగారిఊరే' అంటాడు నాటికలో. ఆకల్పనలోని గూఢత్వంకొరకు ఆమాట అనిపించగూడదు. నవలలో ఆమాట లేమాన్నూ. నవలలోని అమ్మతను పాత్రయొక్క సౌకుమార్యం ప్రాధాన్యం నాటికలో పూర్తిగా పోయినవి. ఆపాత్ర ఏకవీరకు కరదీపికవంటిది. బాల మురళీకృష్ణ (కుట్టాన్) కోసమన్నట్టు కొన్నిపాటలు, కావాలని మరికొన్ని. అయితే రేడియోవారిదృష్ట్యా అది సంగీతరూపకం కావాలి, మరల్లా ప్రకటించలేదేం? ఆకాశవాణి వారు ప్రసిద్ధమైన నవలలకూ నాటకాలకూ ఈ విధంగా అన్యాయం కలిగించడమెందుకు? రాసిన

వారూ ప్రసారం చేసినవారుకూడా దీనివల్ల ఏమి ఆశిస్తున్నారో తెలియదు.

ఈ విధంగానే 1 వ నవంబరున వేదం వెంకట రాయశాస్త్రిగారి విక్రమోర్వశీయం ఆధారంగా వింజమూరివారే సంక్షిప్తంచేసి విజయవాడ కేంద్రమే ప్రచారం చేయగా, రచయిత కన్యాయం గానే తయారయింది. ఈ అన్యాయంలో నిర్వాహకులు బాధ్యత తీసుకొన్నారు. పురూరవ కంఠ ధారి బాలమురళీకృష్ణ వాచికం మినహా మరెవరిదీ బాగాలేదు. 'వయస్యమాత్ర సహాయుడు' అనేది ఊర్వశి చెలినోట 'వేశ్యమాత్ర సహాయుడు' అయింది 'స్వస్తి వాయనం' అనేది మాణవకుని నోట స్వస్తివాచన' మయింది. నాటికకు ముఖ్యమైంది పురూరవుని విరహాంకం. అదే సంస్కృతి తెల్గు పద్యాలతో గజిబిజి అయింది. 'ఇల్లా' ఆధారాలు వ్రాసేకన్నా, స్వంతంగా రాసుకోవచ్చుగదా !

అల్లావ్రాసిన వింజమూరివారిదే 4వ నవంబరున విజయవాడనుండే ప్రసారితమైన 'ఆమెకోసం' అన్న బుధవారపునాటిక...తనకు సంతానంకలిగే యోగం లేదేమోనని డాక్టరుముందూ? భార్య ముందూ అత్యంతం బాధపడ్డ శంకరం..., భార్యని అతిగా ప్రేమించే శంకరం, తనభార్య తమ ఆనందంకోసం పెంపకానికి తెచ్చిన వసంతను ఆదినుండే ద్వేషించడంలో అర్థం కనుపించదు. శంకరం ఒట్టి స్వార్థపరుడుగా చిత్రింపబడ్డాడు. ఒకసారి పిలవగానే పిల్లలకు జడ వేస్తున్న భార్య రానందుకు కోపగించుకొంటాడు. మొదటినుండీ వసంతను విసరి కొడుతుంటాడు - దూరం తోస్తుంటాడు. అతడు 'ఆమె' కోసం చేసిందేమిటి ? చివరకు చచ్చిపోయిన భార్యవచ్చి చెప్పితే వసంతను బాగా చూస్తాడు. ఈ కల్పన మొదటినుండీ వచ్చిన విధానాన్ని దెబ్బతీస్తుంది. భార్య ఒకనాడు వసంతను ద్వేషించమంది కనుక నా ? ... మొదటినుండీ దూరం కొట్టే శంకరాన్నే వసంత ప్రేమించడం వాస్తవానికి విరుద్ధం...స్వంతం 'ఇల్లా' ఉంది. ఆధారా 'ఇల్లా' ఉన్నాయి. అక్టోబరు 16 నుండి నవంబరు 4 వరకు (20 రోజులు) వీరి రచనలు మూడుసార్లు ప్రసారితాలు. సగటున దాదాపు ఏడు రోజుల కొకటి. ఆకాశవాణి కేంద్రాలు అవకాశ వాణి కేంద్రాలుగా తయారవుతున్నాయి.

బుధవారపు నాటికల్లో చాలా బాగున్న నాటిక అక్టోబరు 14 నాటి (విజయవాడ) కొలకలూరి ఇనాక్ గారి 'యువతి.' ఇరవై నిమిషాల అందమైన నాటిక. సంభాషణల్లో చక్కని వేగాన్ని రచయిత సాధించాడు. రోగుల్ని బతికించడానికి ఆస్పత్రిలో నర్స్ వారివారి అభిరుచుల ప్రకారం ఉంటానని అంటుంటుంది. ఒకనితో అతన్ని తప్పకుండా పెండ్లాడడానికీ, అతని భావిజీవితాన్ని సుఖమయం చేయడానికీ ఒప్పుకొంటుంది. తనకులొంగని నర్సు మీద డాక్టర్ పైకి 'రిపోర్టు' చేస్తానంటే నర్స్ అతన్ని తనఇష్టం వచ్చినట్టు చేసుకొమ్మంటుంది... రోగి బ్రతుకుతాడు...ఈ ఘట్టం నాటికకు చాలా అందం తెచ్చింది. సంభాషణలలో వేగాన్ని నర్స్ కంఠధారిణి చక్కగావ్యక్తీకరించింది. లోపం కన్పించనిని నాటిక. నిర్వహణా బాగావుంది.

వావిలాల కృష్ణమూర్తిగారి 'కిం కర్తవ్యం' అన్న నాటిక మద్రాసునుండి అక్టోబరు 12న ప్రసారమైంది. దీనిలో వినిపించేపాత్రలు శరత్ నవలల్లోనివి. 'ఆడవాళ్ళ క్కలిగేది ప్రేమకాదు, కామం' అనే సిద్ధాంతం ఇందులో అనుభవాన్ని గడించిన 'తల్లి' పాత్రచే ప్రతిపాదించబడింది. ఈవిషయం స్త్రీలే సరిగా ఆలోచించాలి. 'కోడలు' వాచికంతప్ప మరెవరిదీ బాగాలేదు. సంభాషణలు చప్పగాఉన్నవి. అభినయం సరిగాలేదు. సిగ్గులేనిసరస్వతి సిగ్గువిడచి నమస్కరిస్తుందట. దీనిఅర్థం ఏమిటో.

అదే కేంద్రం నవంబరు 11న ఆరుద్రగారి 'దేవుని హత్య' ప్రసారంచేసింది. దేవాలయ నిర్వాహకుల దుష్ప్రవర్తనలూ, కొంత ప్రేమాయణమూ మిళాయింపబడి గజిబిజిఅయింది. నాస్తికుడుగా కనబడే ఆస్తికుడు ఈశ్వరరావు దేవాలయాలమీది అధికారి

మారువేషంలో—అనగా C. I. D. గా ఆవూరి దేవాలయాధికారుల పనిబడతాడు. ఆదేవాలయాధికారుల దౌష్ట్యానికే గురిఅయిన సుందరిని అట్టే ప్రేమించి పెళ్ళాడుతాడు. ఆసుందరి దేవీభక్తురాలు. దేవీవిగ్రహం పడిపోయినా ఆభక్తురాలకి చీమకుట్టినట్టు కూడా అనిపించదు. సత్యం అతిగా పల్కే 'అమంగళం అప్రతిహతమగుగాక' అనేది విసిగిస్తుంది. పైగా లింగమూర్తి (ధర్మకర్త) వంగర (పూజారి) అభినయాలు అతిఅయి వెగటు కల్గించాయి. డిటెక్టివు నాటికలాంటి ఇది తృప్తికరంగా కూడా లేదు. నిర్వహణ అందుకు బాగా తోడ్పడింది.

నగరవాణి మరియు గ్రామస్థులకార్యక్రమాల్లో కలసికట్టుగా అక్టోబరు 31 న నారాయణరెడ్డిగారి 'దివ్వెల మువ్వల' నాటిక ప్రసారితమైంది. దీపావళి ఉపలక్షకంగా తయారింపబడింది. అచ్చమైన వెల్గుకోసం ప్రాకులాడే వ్యక్తికి మాయ అడ్డమవుతుంది. దాన్ని తొలగించుకుంటే అసలువెల్గు కనబడుతుంది. ఇది చెప్పదలచిన విషయం. అవుతే అద్వైతాన్ని గంభీరంగా వ్యక్తంచేసే ఉబలాటంలో ఈభావ వ్యక్తీకరణక్లిష్టమైపోయింది. అద్వైతాన్ని కొన్ని పడికట్టు మాటలు పట్టుకొని చెప్పే ప్రయత్నం ఈరోజుల్లో ఒక కవితావిలాసమైంది. అసలుతత్వం అర్థంకాకుండాపోతే వ్యక్తీకరణ లోపంగా ఉంటుంది. అదే ఈ నాటికలో ఉంది. సెలపరు నడకల్లో వెల్తురు (?) దివ్వెల మువ్వల దాని గజ్జెల కదలింపులు ఈ నాటికలో వినవచ్చు. అందంగా, ఆహ్లాదకరంగా పాడేవాళ్లుంటే ఇల్లాంటి నాటికలు—ప్రయోజనం సరిగా లేకున్నా—బాగుంటాయి.

సాహిత్యనందిని కార్యక్రమంలో హైద్రాబాదు కేంద్రం అక్టో. 20 న దుర్గానంద్ గారి 'తెలుగులో గేయ కావ్యాలు' అన్నప్రసంగం ప్రసారం చేసింది. సంస్కృతి పేరుతో సంప్రదాయంవైపు పోకుండా ఉండాలన్నారు ప్రాసంగికులు. సంప్రదాయవిరహితంగా సంస్కృతివైపు ఎల్లావెళ్ళాలో వివరించలేదు మరి. జలపాతంతో కవిత్వాన్ని (పద్యాన్ని) ప్రవాహంతో వచనాన్నీ పోల్చారు. ఓజోగుణం కవిత్వంలోనే ఉంటుందనీ, వచనంలో ఉండదనీ తేల్చారు. వచనంలో గనుక ఆగుణం ఉంటే అది కవిత్వమైపోతుందని ఉద్దేశ్యం కావచ్చు. ఛందస్సు బాహ్యారూపం కాదు. ఆత్మగుణంఅన్నా గుణాగుంది. అయితే ఇది తెలియకే క్రొత్త ఛందస్సులకోసం అన్వేషిస్తున్నారట కొందరు. అట్లా అన్వేషించకుండా ఉంటే ఇన్నిరకాల ఛందస్సులు ఇప్పటికి పుట్టేవేకావు గదా! భావాన్నిబట్టి ఛందస్సు నేర్పర్చుకోవడం జరుగుతుంది... ఊర్వశి, ప్రవాసం, కృష్ణపక్షం గేయ కావ్యాలట. గీత కావ్యాలన్నా బాగుండేది. వాటిల్లో గీత పద్యబాహుళ్యం ఉంది. ప్రాసంగికులకది తెలియక గేయ కావ్యాల్లోకి వాటినీడ్చారా మరి! 'శశికళ' అని అడివి బాపిరాజుగారి గేయ సంపుటి ఉందని తెలియదనే ఆ ప్రసంగం తెల్పుతుంది. కొన్ని విచిత్ర వ్యాఖ్యానాలు ఉన్నాయిందులో.

'దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్'

అనే దాని వ్యాఖ్యానం చూడవచ్చు. 'మట్టి'లో వ్యావహారికవాదం, 'దేశం' లో దేశభక్తి, 'మనుషులు' లో మానవతావాదం, 'ఓయ్' అనే దానిలో రాబోయేవారికి హెచ్చరిక ఉన్నాయిట. 'అంటే' లో, 'కాదు' లో ఏం అర్థాలున్నాయో సెలవిచ్చారుకాదు ప్రాసంగికులు. ఈనాటివారికి పై దానిలో ఏ ప్రబోధమూ లేదా !......ఈ వ్యాఖ్యానం గురజాడవారే వింటే, అసలు ఆ గీతాలు తాను వ్రాసానవేవానో కాదో !....కథా కావ్యాలకే కావ్యం అని వ్యవహారం. ముక్తకాది ప్రతీకలు ఇతరమైనవాటికున్నాయి. విశువర్షీయుసి ఘటనాకావ్యం కావచ్చు. మరి కృష్ణపక్షాదుల మాట !....ప్రసంగంలో ఆధునికాలు మాత్రమే ఎక్కువగా గ్రహించబడ్డాయి. పూర్వీయ సాహిత్యం

కొంచెం పేర్కొబడింది. అంతే......'రేడియో బ్రాడ్‌కాస్టింగ్' వాణిలో వ్రాసినట్టు '—ప్రసంగ వ్యాసం మీరు వ్రాయడానికి ప్రారంభించేముందు నిలయంలో ఆ విషయశాఖకి సంబంధించిన అధికారితో సంప్రదించడం మంచిది'...అక్కడా అంతంతే అనుకుంటే, జానపదగేయ వాఙ్మయం లాంటి గ్రంథాలు చూడడం మంచిది...ప్రసంగ పఠనానికిదే మొదలేమో, చదవేపద్ధతిలో చాలా తొట్రుపాట్లు, పొరపాట్లూ జరిగినయి.

అదే సా. నందిని కార్యక్రమంలో విజయవాడ కేంద్రంనుండి నవం 10 న తిరుమల రామచంద్ర గారి 'అంపకాలు' అనే కథానిక ప్రసారితమైంది. గాథాసప్తశతిలోని ఒక మరీ చిన్నికథ ఆధారంగా వ్రాయబడింది. కథకథగా ఏమీ గొప్పలేదు. ఒక అమ్మాయి ఒకబ్బాయిని ఒక జాతరలోచూచి ప్రేమిస్తుంది. ఆఅమ్మాయి తల్లిదండ్రులు ఆ కుర్రాణ్ణి వెతికించి తెచ్చి అమ్మాయినిచ్చి పెళ్ళిచేసి అంపకాలు చేస్తారు. ఇంతే. కాని కథ ఆధారంగా ఆనాటి అనేక అలంకారాలు, గ్రామాల పరిస్థితులు, దారుల వివరాలు, అతిథి మర్యాదలూ, ఆచారాలూ చాలా అందంగా చిత్రించబడ్డవి. వింటున్నంతసేపూ శ్రోత ఆగాథలనాటికాలంలో తానున్నట్టుగా అనందిస్తాడు. గాథల్లోఉన్న అనేకమైన అందమైన విషయాలు సరిగా రామచంద్రగారు కూర్చారు. చలికాలంలో జవరాలిని చూచుకొని వచ్చుడం అమ్ముకోవడాలూ మొదలైనవి సుకుమారంగా చెప్పబడ్డాయి. రొమ్ములమీద పండిపడితే, అవి మొగం అనే తామరపూవుదగ్గిరఉన్న హంసల్లా ఉన్నవిట. ఒడలినిండా పిండిపడితే ఆమె, అప్పుడే క్షీరసాగరంనుండి జన్మించే లక్ష్మిలా ఉందిట. అయితే కొన్ని అర్థంకాని పదాలు ఆ కాలానికి సంబంధించినవి ఉన్నవి. వాటివల్ల శ్రోత బాధపడకపోవడానికి కారణం, వెంటవెంటనే వాటి వివరణలాగా కథలోనే కలిసినట్లుగా అర్థం తెలుపడమే. అయినా రామచంద్రగారు వాటికి ఈనాటి సరియైన అర్థాలతో కథ ప్రచురిస్తే చాలా బావుంటుంది. ఆధునికులు గాథాసప్తశతి చదవవలసిన అవసరం ఎంతైనా ఉంది. వాటిలో పూర్వాంధ్రీయ సాంఘిక విషయాలు చాలా ఉన్నవి. ఈ కథ వ్రాసినందుకు రామచంద్రగా రభినంద్యులు.

స్వగతాలు కొన్ని రేడియోవారు ప్రసారం చేస్తున్నారు. ఈ స్వగతాల స్వరూపం ఏమిటో వారికి తెలియడంలేదు. వారికి తెలియని చాలా వాటిల్లో ఇదొకటి. ఎందుకో ఉదాహరిస్తాను. నవంబరు 2 న జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారి 'ప్రబంధనాయికల స్వగతం, వరూధిని' ప్రసారం చేసింది మద్రాసుకేంద్రం. అదే కేంద్రం కొన్ని రోజులక్రితంసరిగ్గా ఇలాంటిదే-ఏకవీరప్రసారం చేసి, దాన్ని ఏకపాత్రాభినయం అంది....స్వగతం అనేది నాటకాల్లోని ఒక సాంకేతికపదం. అభినయానికి సంబంధించింది. అంతేకాని స్వంతంగా దానికి ఉనికి లేదు. అసలీ 'స్వగతం' జరిగిన విషయాన్నిగూర్చా? జరుగుతున్న దానిని గూర్చా? జరుగబోయేదాన్ని గూర్చా? అదేమిటో తెలియని విధంగా ఉంటున్నాయి 'స్వగతాలు'. వరూధిని తన కథ తాను చెప్పుతుంటే అది స్వగతం ఎందుకావాలి? కథనం కావాలి...స్వగతం అనేమాట ఉపయోగించేకన్నా తనలో తాను అంటే, ఆ నాటకీయ పదాన్ని పాడు చేయకుండా ఉండడం జరిగేది. జలసూత్రంగారికి 'తనలో తాను' కొత్తకాదుకదా....ప్రస్తుతం.... వరూధినీ స్వగతం పెద్దనగారి మనుచరిత్రపై ఆధారపడింది. ఆ కథకు చాలా అందం తెచ్చినది వరూధినీ ప్రవరుల వాదవివాదం. అది దీనిలో ముక్తసరిగా ఉంది...వరూధినికి తనను 'కలిసిన'వాడు మాయాప్రవరుడని తెలియడంలో కథలోని అందం దెబ్బతింటున్నది....రచనలో ఉన్న అందాన్ని కంఠధారిణి వికారంగా చేసింది....ఏడ్చినట్టు అభినయిస్తే నవ్వినట్టుంది. ఇంతకన్న నిర్వాహణలో ఇంకా ఏం లోపం కావాలి? ఇల్లాంటిదే నవంబరు 1 న హైద్రాబాదునుండి వనితావాణిలో వాయని

సుబ్బారావుగారి 'శకుంతల స్వగతం' ప్రసారమైంది...మారీచాశ్రమంనుండి భర్తదగ్గరకు వెళ్ళే స్వాతంత్ర్యం తనకులేదనీ, తాను కారణంకాని శాపంవల్ల తన భర్తకు దూరమైనాననీ శకుంతల అంటుంది. దుష్యంత సమాగమం తరువాతగదా శాపం వచ్చిందని తెలిసేది...అదీగాక పై వాటికి కారణాలు వివరించబడక పోవడం మూలంగా విచార్యాలవుతున్నాయి. ఈ కంఠధారిణి రచనకు అన్యాయం మాత్రం చేయలేదు ...స్వగతాలను ఈసారి ప్రసారం చేసేప్పుడు పేరు విషయంలో, నిర్వహణ విషయంలో ఆకాశవాణివారు శ్రద్ధ తీసుకోవలసిన అవసరం చాలా ఉన్నది.

వార్తాశ్రావకులనుగూర్చి రెండోసారి : తెలుగు భాషను ఏదో క్రొత్తదారిలోకి తీసుకు వెళ్ళున్నామన్నట్టుగా వర్తిస్తున్న వార్తాశ్రావకులు తమ అభియాసతో శ్రోతకు మహావిసుగు కలిగిస్తున్నారు. వాక్యాలు సరిగా ఉంటేనే వార్తలు శ్రోతకు సరిగా అర్థమవుతాయి. వాక్యాలు ఎంత మెలికలు వేయబడ్డాయో ? అని శ్రావకుడు వాక్య నిర్మాణాన్నిగూర్చి కాదు శ్రోతకు కావలసింది. అతనికి వార్తలు అర్థమవాలి. అంతే. అనువాదాల్లో మహా వికారత్వం వస్తున్నది. దేశంకు సర్వనామంగా వాడడం ఇంగ్లీషు సంప్రదాయం. దాన్ని తెలుగులోకి ఈడ్చి తెలుగును ఇంగ్లీషుగా చేస్తున్నారు.... ఈవాక్యం వినండి, సహకారం లేకుంటే దేశం *'కుంటువడిన నిర్జీవరంగం'* గా ఉంటుందిట. ఈ నిర్జీవరంగం కుంటువడడ మేమిటో ఆ వార్తాశ్రావకులకూ, ఆయా ఆ-వాణి అధికారులకే తెలియాలి మరి. గుంపునుచెప్పే సామూహికైక వచనానికి బహువచనం ఉపయోగిస్తున్నారు వీరు... వర్తకప్రతినిధివర్గం ... చేరారు. వర్గం అనేదానిక్రియ ఏకవచనంలోనే ఉండాలి...రేడియోవారు వ్యాకరణాన్నికూడా సంస్కరించేట్టున్నారు చూడబోతే. ఈవిధంగా సంస్కరిస్తే నాల్గోనాడే తెలుగుభాష ఏరూపం తాలుస్తుందో ఇక చెప్పక్కరలేదు. పదాలను కలపడంలో ఎంత కర్ణకఠోరత ఆపాదిస్తున్నారో—దానికి అంతులేదు. 'రెగ్యులర్ సర్వీసు' బాగుంది. తాత్కాలిక సర్వీసు, అత్యవసరసర్వీసు, ......ఇవేమిటి ? వీటి ఇంగ్లీషు పదాలేమైనాయి? రెగ్యులర్ సర్వీసు అర్థం అయి అవికాకుండా పోయాయా ? అనువాదం చేయడం కుదరకపోతే వాటిమానాన వాటిని వదిలెయ్యాలి లేదా, వివరించాలి; అంతేకాని తెలుగుభాషని నానాకంగాలు చేయవద్దు. ఆ—వాణివారు భాషనిల్లా దుష్టపరచుకోడానికిపూనడం, దేశాభివృద్ధికి దోహదంచేద్దామనుకొనే, *'బహుజన హితాయ బహుజన సుఖాయ'* అనే వారి మూలసిద్ధాంతానికే గొడ్డలిపెట్టు. కేంద్రీయులు బాగా జాగ్రత్తగా ఆలోచించుకోవలసి ఉంటుంది.

— సామీరి.

సాహిత్యధార :

ఈ శతాబ్దపు ద్వితీయ దశాబ్దములో తెలుగు దేశములో నొక ప్రేమసిద్ధాంతము బయలుదేరినది. ఆ సిద్ధాంతము ప్రకారము ప్రేమ దివ్యము. అది భగవంతుడు. అది సృష్టికి మూలము. శాశ్వతము. జగత్తులోనున్న ఉత్తమ విశేషణము లన్నియు దానికి తగిలింప వచ్చును. ఐనను అది పూర్తిగా చెప్పబడినట్లుగాదు. సరిగా రూపుకట్టని, కట్టించుకొనుటకు కూడ వీలుకాని, ఈదృశ ప్రేమభావము ఆనాటి కవితా ప్రవాహాలన్నమై తెలుగుదేశము మీదికి దండెత్తినది. అట్టాలకముపై అటుఇటు తిరుగుచున్న కాంత, ఒక చరణ మంజీరరావము, ఒక గాజుల గలగల, ఎక్కడనో ఎవరికొరకో ఉద్దేశింపబడిన ఒక చిరునవ్వు, ఒక చేలాంచలముయొక్క విసురు, ఎద

లోపలి యెదలో తోచిన ఒక మెరవు - సర్వమును కవితావిషయములై ప్రేమకన్న మహాభావము లేదన్నట్లు, స్త్రీని వదలిన కవితావస్తువు లేదన్నట్లు తెలుగుదేశములోని సర్వకవిత్వము ప్రేయసీమయమై పోయినది.

అంతవరకు బాగుగనే యున్నది. చిక్కెక్కడ మున్నదనగా ఈ ప్రేమ దివ్యమన్నచోట, అది భగవంతు డన్నచోట.

కొందరు ప్రవక్తల వాక్యము లున్నవి. ప్రేమ దివ్యము. ప్రేమ భగవంతుడు అని. ఆ ప్రేమవేరు. ఆ ప్రేమ స్త్రీ పురుషుల నాశ్రయించి లేదు. జగత్తులోని సర్వమానవజాతి నాశ్రయించి యున్నది. అదియు దివ్యమగునా కాదా యన్న చర్చ యట్లుండగా ఒక ప్రత్యేకస్త్రీగతమైన, వాంఛమూలముగా గలిగిన—లేదని వారు వాదింపవచ్చును—శృంగార విషయికమైన ఈ ప్రేమ భగవద్భావనవంటి దెట్లయినది? దివ్య మెట్లయినది. 'రాగద్వేషముల' లోని 'రాగ' మన్నమాట కతీతమైన అర్థము ఈ ప్రేమకుండుటకు వీలున్నదా? లేనిచో ఇది నట్టి లౌకికమైన, సర్వజనులకు నిత్యానుభవములో నున్న విషయము.

ఈ ప్రవాహమునకు నిరోధముగా అప్పటి నుండియే మహాపర్వతమువలె నిలబడినవారు నిలబడగా అభ్యుదయ కవితాసిద్ధాంతము బయలుదేరి ఈ సిద్ధాంతమును విరుగదన్నినది మరల తల యెత్తకుండ.

ఈ ప్రేమసిద్ధాంతపుకాలములో తానొక సిద్ధాంతము ప్రతిపాదించినవాడు చలం. ఆయన ప్రేమ రూపులేనిది కాదు. గాలిలోనిది కాదు. అది శరీరము నాశ్రయించినది. ఆ శరీర మేమార్గమునకు లాగినచో దాని వెంటబడి పోవునది. దానికి ధర్మాధర్మ విచక్షణలేదు. న్యాయాన్యాయ విచక్షణ లేదు. అది ధిక్కృతాన్యవిషయ పరిజ్ఞానమైనది.

ఈ చలంవ్రాసిన పురూరవయన్న నాటిక నద్వైతపరముగా వ్యాఖ్యానించుటకు ప్రయత్నము చేసినవారు సంపత్కుమారగారు. (జయంతి 13) దీనిలోని సత్యాసత్యము లెట్లున్నను ఈ ప్రక్రియ క్రొత్తగా మాత్రమున్నది.

ఇంద్రియప్రధానులమైన మనకు చలం యువావస్థలో ఆనందము - సామాన్యార్థములో - కలిగించుచున్నాడన్నమాట నిజము. అది యొవ్వు కొన్నచో జాలును. తమ తృష్ణను దీర్చుకొనుటకు వ్రాసిన ప్రేమ కవిత్వమున కలౌకికమైన దీప్తి నిచ్చుటకు ప్రేమకవులు చేసినప్రయత్నమును చలంకొరకు సంపత్కుమార చేయవలసిన యనసరము లేదనుకొందును.

సారస్వతము నందొక వ్యవస్థను కలిగించుటకు ప్రయత్నము చేయుటకై బయలుదేరిన జయంతి కొక సంవత్సరము నిండినది. ఈ వ్యవస్థయన్న శబ్దము వినుటతోనే కొందరి కరికాలు మంటనెత్తి కెక్కకపోలేదు. పండితవ్యవస్థయని దీనిని గేలి చేయుటకు ప్రయత్నము కూడ జరిగింది. తెలుగు రచయితల కనేకులకు విచారించి మాటాడుట వ్రాయుట అలవాటు లేనట్లున్నది. పండితవ్యవస్థ ఎందుచేత చెడ్డదికావలయును? ఇట్లనువారు అపండితవ్యవస్థ నెలకొలుపజూచు చున్నారా? అపాండిత్యమునకు వ్యవస్థ యేమిటి? ఏ శాస్త్రము నందైనను పండితుల వాక్కులకే ప్రామాణ్యము కాని అపండితుల వాక్కులకు కాదు. టెక్నీషియన్లు అనబడు వారందరును పండితులే. సైంటిస్టులు అనబడు వారందరును పండితులే ఒక దేశమున కొక రాజ్యాంగము కావలయును. అది తయారు చేయువారు పండితులు. దేశములో ఆర్థికమైన ఇబ్బందులను తొలగించుటకు ప్రణాళికలు తయారు చేయువారు పండితులు. స్పుట్నిక్ తయారు చేసిన వారు పండితులు. చంద్రలోకమును జయించుటకు ప్రయత్నముచేయువారు పండితులు. వారందరిని పండితులని గేలిచేయుదురా? జీవిత సర్వశాఖలలో పండితవ్యవస్థ యుండవలయును కాని ఒక సాహిత్యములో నుండకూడదా? నిజమునకు వ్యవస్థ లేనిది మానవజగత్తు సాగదు. అటవికులకు వ్యవస్థ యక్కరలేదు. మిగిలిన వారికి కావలయును. వ్యవస్థ కలిగించుటకు ప్రయత్నముచేయుట యనగా సభ్యత కలిగించుటకు ప్రయత్నము చేయుట యన్న మాట.

అసలు పండితుడన్న శబ్దమును వినుటతోడనే నీరింత గోలకెందు కెత్తుదురు? పండితు డనగా ఒక విషయము లెస్సగా నెఱుగువాడు. పండ యనగా బుద్ధి. అది కలవాడు. బుద్ధిగలవారు నిర్మించిన వ్యవస్థ కోరదగినదేకదా! ఇదవర కొకడుప్పు

మనవి చేసుకొన్నాను. ఆపండితులు తమ సంఖ్యా బలముచేత పండితులను పీడించి పరపీడనపరాయణు లగుచున్నారని. ఈ పరపీడనోద్యమము ప్రచార బలముమీద సాగుచున్నది. ఈ ప్రచారసాధనములు నేటి పత్రికలు.

ఒక సంవత్సరపు జయంతిని సమీక్షించుచు కథానికలపై సంపాదకులు శ్రద్ధవహించుట లేదని హరిబాబుగారు వ్రాసినమాట సత్యము. ఒక్క జయంతి సంపాదకులేకాదు. ఏ పత్రికా సంపాద కులును కథలనుగూర్చి శ్రద్ధవహించుట లేదని చెప్ప వలసివచ్చుచున్నది. క్రమము దప్పకుండ వెలువడు మూడు సాహిత్య మాసపత్రికలలో (భారతి, స్రవంతి, జయంతి) ఈ నెలలో పేర్కొనదగిన కథ లేదు. ప్రధానముగా కథలు ప్రచురించు పత్రికలు సాహిత్యములో ఏది కథయనబడునో దానివంక కే బోవుటలేదు. తెలుగుదేశములో కథకులు లేరా? లేరని చెప్పుట సాహసము. నవోదయలో కొడవటిగంటి కుటుంబరావుగారు చక్కని కథ వ్రాయుచున్నారు. బుచ్చిబాబుగారీసంవత్సరం జయంతిలో రెండు చక్కని కథలు వ్రాసినారు. పెద్దలమాట యటుంచి పిన్నలలో చక్కని కథలు వ్రాయువా రనేకులున్నారు. వారెవరెవ రెక్కడెక్కడ నున్నారో వెదకి బయటికి తెచ్చుట పత్రికలపని. వారాపని చేయవలసినంత శ్రద్ధగా చేయుటలేదు.

సంప్రదాయమార్గములో కవిత్వము వ్రాయు వారికి తెలుగుదేశములో కొదువలేదు. (చల్లాసీతా రామాంజనేయులు - భార్గవీగీత, జయంతి 13) ఏలువచ్చి నవ్యకవితా మార్గము బట్టినవారిలోనే చేవగల కవిత్వము వ్రాయువారరుదు. అట్టి పరిమిత సంఖ్యాకులలో కుందుర్తిగా రొకరు. (అంతర్ముఖుడు జయంతి 13) రమణారెడ్డిగారి పేరు ఇదివరకే చెప్పబడినది.

కథకళి సాహిత్యమునుగూర్చి పుట్టపర్తి నారాయణాచార్యులు (భారతి) చక్కని సామగ్రి యందిచ్చినారు. పరిశోధన వ్యాసములకు కొంత స్థానము తగ్గించి సాహిత్య వ్యాసములకు స్థానము పెంచినచో భారతివారు పాఠకులకు మేలుచేసినవా రగుదురు.

'జీవుని వేదన' ను గురించి వ్యాఖ్యానించుచు శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు జయంతిలో వ్రాసినారు, ఇదివరకెప్పుడో భారతిలో ఈ శీర్షికతోనే విశ్వనాథ సత్యనారాయణగారి కవిత్వమును గురించి ఒక వ్యాసము వ్రాసిరి. అనుకరణ ప్రధానులైన ఆంధ్రరచయితలు ఆ శబ్దముయొక్క అర్థమేమను విచారించకుండ దానిని పచ్చడిక్రింద నలిపి వేయుచున్నారు. 'జీవుని వేదన' కు అర్థవివరణ యవశ్యము కోరదగినదే.

దుర్గానంద్ (పేరు తాగుమారుగాకుండ ఈ జాగ్రత్తగై కొనవలసి వచ్చుచున్నది. ఆ పేరులో అంతముఖ్యమైన గకారము ఇదివరకు మాయమగుట నిజముగా దురదృష్టము. అదిగాక కొన్ని వేలయేండ్లనుంచి వ్రాయుచున్నట్లే ఇప్పుడు మన మెందుకు వ్రాయవలెను. ఇరువదవశతాబ్దములో వ్రాసిన గ్రంథమునకు వేయియేండ్లనాటి సంస్కృత ప్రయోగములు ప్రమాణము కాకూడదని వారే వ్రాసినారు. (స్రవంతి 32) దుర్గా యన్నది సంస్కృత శబ్దము. అదికాక వ్యావహారిక భాషకు హలంతముల మీద మిక్కిలి ప్రేమ. ఇదియొక క్రొత్త ముద్రణా పద్ధతి ఎందుకు కాకూడదు. అట్లు వ్రాయుట పాతసత్యము. ఇట్లు వ్రాయుట కొత్త సత్యము) గారి రామాయణ కల్పవృక్షముపై విమర్శ పూర్తియైనది.

తన అనధికారము నిరూపింపబడుచున్నదని ఈ 'జీవుని వేదన'. దక్షిణభారత హిందీసభను, పత్రికను బెదరించుచున్నానని ఆరోపణ. నే నెవడను బెదరించుటకు? అయినా అదేమైన మనిషియా బెదరింపబడుటకు?

తన యనధికారమునకు ఎవరేమి చేయుదురు? అది కష్టపడి సంపాదించుకొన్నచో వచ్చును. ఊరకే విమర్శలు వ్రాసినచో రాదు. నాలుగు ఖడీబోలీ పుస్తకములు చదివినచో ఈ కాలములో ఉదర పోషణమునకు అవకాశ మేర్పడగలదేమోకాని రూపకాలంకారమేదియగునో ఏదికాదో ఎట్లు తెలియును. తర్కసంగ్రహములో నేమున్నదో ఆపైన నేమున్నదో ఎట్లు తెలియును. ఏది తాత్త్వికవిషయమో, ఏది నిఘంటుగతమో ఎట్లు తెలియును. నాకు తెలియును అనుట చాలతేలిక. ఆ తెలియుటయే కష్టము. తెలియుటకుదాహరణము చూడుడు. 'జీవితాన్ని ఉపయోగించుకోగా మిగిలిన మిగులు

సత్యం ?' ఖడీబోలీలో ఇది పాండిత్య మగునేమో మాకు తెలియదు.

శాస్త్రములమీద వ్యాకరణముమీద అంత కోప మెందుకు ?

'జనిత్వా కింను స్యాత్
కిమపి యది శాస్త్రం న విదితం'

మృచ్ఛకటికాకారు డెప్పుడో వాపోయినాడు ఈ 'మాంసవృక్షము'లచేత వసుంధరభారాక్రాంత యగుచున్నదని. విల్హణుడనలేదా ?

'కుంఠత్వ మాయాతి గుణః కవీనాం
సాహిత్యవిద్యాశ్రమ వర్జితేషు.'

—నమవర్తి



## పుస్తక సమీక్ష :

### అంగారవల్లరి

రచన :
కె. వి. రమణారెడ్డి
ప్రచురణ :
అభ్యుదయ రచయితల సంఘం విజయవాద
వెల : అర్ధరూపాయి

భువనఘోష తరువాత రమణారెడ్డిగారు మళ్ళీ ఒక ఖండకావ్యాన్ని ప్రచురించారు. విమర్శకులుగానే చాలామంది పాఠకులకు పరిచితులైన రమణారెడ్డిగారి కవితాలక్షణ మీ సంపుటిలో స్పష్టంగా వెల్లడిఅవుతున్నది. దీనిలో మొత్తం 12 ఖండికలు ఉన్నవి. అన్నిట్లో ఎక్కువగా మాత్రాఛందస్సులపై క్రొత్త ప్రయోగాలుచేసే ఉత్సాహం గోచరిస్తూ వున్నది. ఈ గతులు సాధారణులైన మాత్రాకవుల రచనలలోని గతులకన్న విశిష్టములుగా భాసిస్తున్నవి. 'ప్రస్థానం' అన్న రచనలో రచయిత తన ఛందస్సు మీద అధికారాన్ని స్ఫురింపజేసినారు. యతి, ప్రాస లేకుండానే మాత్రాఛందస్సు మనోజ్ఞంగా నడిపింప వచ్చు అన్న నమ్మకం యీ కవికున్నట్టుగావుంది.

అన్ని ఖండికల్లోను 'విశ్వవత్సల' 'రత్నదీపం' అన్న ఖండాలు మనోజ్ఞంగా వున్నవి. రత్నదీపంలో వాడిన ఛందస్సు దాని వైశిష్ట్యాని కనుగుణంగా ప్రశాంతగతిలో నడిచింది. ఊరిలో మశూచి వ్యాపించినపుడు వాళ్ళందరినీ రక్షించడానికి తన ప్రాణం పోగొట్టుకొన్న త్యాగి, గాదిరాజు సుబ్బారాజు స్మృతిగా యీ రచన యీ సంపుటిలో కిరీటాయమానంగా వుంది. 'విశ్వవత్సల' అన్న ఖండికలో యీ జగత్తును నడిపించే ఒక తల్లిని గూర్చి (దేవుడు కాదట! దేవుడంటే మరేమిటో!) సర్వజగచ్చైతన్యమునకు మూలస్థానముగా వర్ణింపబడినది. 'కారాగారము' 'చిట్టడవిలో చిన్నారి' అన్న రచనల్లో వున్న వచనము అంతర్లయాన్వితముగా వున్నమాట యథార్థమైకూడ ఛందోబద్ధంగా వున్నప్పటి రచనలోని వున్న బిగువును పొందలేదు. (ఈ మధ్య కొన్ని మాత్రాఛందోబద్ధములయిన కావ్యాలు ఇంతకన్నా పలచబడి వచనప్రాయంగా వుంటం కద్దు)

పీఠికనుగూర్చి :—

దీనికి శ్రీశ్రీగారు పీఠిక రాశారు. రచయిత 'భువనఘోష' లో ఉబుసుపోకకు చాలా తేలిక మనస్థితిలో వ్రాసిన 'ఆంధ్రకవిత్వ చరిత్ర' అన్న ఖండికను (దాన్నే చాలామంది విమర్శించారు.) శ్రీశ్రీగారు ఆవేశగుణం అన్న పేరుతో వెనకేసు కొచ్చారు. ఇక్కడ రచయిత. శ్రీశ్రీ భేదించారు. ఎవరో గురజాడను కవిగాదంటే మురికికాలువల యుగంలో నివసిస్తున్న శ్రీశ్రీ వాళ్ళను పాతరాతి యుగపు మనుషులని యీసడించారు. కావ్యానికి కథావస్తువుయొక్క అవసరంలేదని, కథలేకుండానే రససిద్ధిగలుగుతుందని ఆయన ఉద్దేశం. కథా గిథా లేనప్పుడు చమత్కారమో యేదో కలుగవచ్చు కాని, రసానుభూతి కలుగుతుందనడం ప్రామాణికం గాదు.

చివరకు ఉజ్వలమైన కావ్యాన్ని రాస్తారనే ఆశ రమణారెడ్డినిచూస్తే కలుగుతున్నది.

—సుప్రసన్న

## PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA PRADESH.

R. C. No. 973 M 4/58. Dated 8—6—59.

The following Telugu monthly is commended for use in all the Libraries of Schools, Colleges and public Libraries in the State.

Name: JAYANTI

K. RAGHAVA REDDY,
*For Director of Public Instruction.*



## HEALTH & LOCAL ADMINISTRATION DEPARTMENT

G. O. Ms. No. 2379 Tel. A D/ 26 September 59

The Government commend the purchase of the Telugu Literary Monthly Magazine "JAYANTI" published by Sri J. Gouthama Rao, by the libraries maintained by them.

M. Lokanatham,
*Dy. Secretary to Government.*

'జయంతి' రైల్వే స్టేషనులోని 'హిగిన్‌బాథమ్స్' పుస్తకశాలలో దొరుకును.

518, సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జువ్వాడి గౌతమరావుచే ప్రకటితము. ఫోన్ : 4616
అజంతా ప్రెంటర్సు, సికింద్రాబాదు.